శ్రీ ర స్తు

# శ్రీ భగవద్గీతామృతము



తెలుగు వ్యాఖ్య

శ్రీమాన్. K. S. రామానుజాచార్యులు




సంస్కృత వ్యాఖ్య

శ్రీ మద్వరవరమునీంద్రుల గీతార్థ సంగ్రహ దీపిక

ప్రకాశకులు

శ్రీ గోదా గ్రంథమాల

ముసునూరు - 521 207

కృష్ణా జిల్లా.

శ్రీ గోదా గ్రంథమాల

శాస్త్ర వాఙ్మయము - సప్తమ కుసుమము

ప్రథమ ముద్రణ 1991

ప్రజోత్పత్తి మీనము

ప్రతులు 1000

వెల రు. **20-00**



ప్రాప్తిస్థానము

1. **K. S.** రామానుజాచార్యులు
   వానమామలై మఠము
   మూలాపేట - నెల్లూరు-3.

2. శ్రీ గోదా గ్రంథమాల
   ముసునూరు-521207. కృష్ణా జిల్లా.

3. శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్
   కూకట్‌పల్లి (రామాలయం వద్ద)
   హైదరాబాద్. ఆం. ప్ర.

ముద్రణ
గోపీకృష్ణ ప్రింటర్స్
20/204, బ్రాహ్మణవీథి
మూలాపేట, నెల్లూరు-3.

వ్యవస్థాపకులు - ప్రకాశకులు
శ్రీ గోదా గ్రంథమాల
ముసునూరు
కృష్ణాజిల్లా.

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# ప్రజోత్పత్తి నవ వర్షాకాంక్ష!




శ్లో॥ ప్రజోత్పత్త్యాం సదా కృత్వా
యుష్మత్ క్లేశ ప్రణాశనమ్।
పాతు వో దివ్యకృపయా
గోదా శ్రీరంగనాయకీ॥

తే.గీ. ఈ ప్రజోత్పత్తి వర్షాన నింపుమీర
నాయు రారోగ్య శుభముల నందజేసి
పుత్రపౌత్రాది సంపద పొసగనిచ్చి
ప్రోచుగావుత మిమ్ము సదా భూమిపుత్రి

తే.గీ. గ్రంథమాలలో దివ్య ప్రబంధములను
వ్యాఖ్యతో ముద్రణము చేసివ్యాప్తి చేయఁ
దలచు మాయుద్యమమునకు తగిన రీతి
సాయపడగోరుచున్నాము, సరసు లెపుడు!

తే.గీ. గ్రంథమాలను నడపుట కష్టసాధ్య
మనెడి సూక్తిని మీరెద ననుభవించి
మాకు పుష్కల సహకార మందజేసి
భాగ్యవంతులు కండయ్య భక్తులార.

శ్రీ గోదా గ్రంథమాల

శ్రీరస్తు

# ప్రార్థనా

జయతు జయతు దేవో దేవకీనన్దనోఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాఙ్గో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః ॥

జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వన్ద్వ సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు।
కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాఙ్ఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకున్దపాదతులసీం మూర్ధన్న మాఽధోక్షజమ్ ॥

హే లోకా శ్శృణుత ప్రసూతిమరణవ్యాధే శ్చికిత్సా మిమాం
యోగజ్ఞా స్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః।
అన్తర్జ్యోతి రమేయ మేక మమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యన్తికమ్ ॥

హే మర్త్యాః పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహులం సమ్యక్ప్రవిశ్య స్థితాః।
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం
మన్త్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః ॥

కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః।
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం హే కృష్ణ రక్షస్వ మామ్ ॥

తత్త్వం ప్రసీద భగవన్ కురు మయ్యనాథే
విష్ణో కృపాం పరమ కారుణికః కిల త్వమ్।
సంసారసాగరనిమగ్న మనన్త దీన
ముద్ధర్తు మర్హసి హరే పురుషోత్తమోఽసి ॥

-○○○-

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# మనవి

ఊ

శ్లో॥ మల నిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే।
సకృద్గీతాఽంభసి స్నానం సంసార మల నాశనమ్ ॥

శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా ॥

శ్రీకృష్ణ భగవానుని గీతా గంగోదకమును లోకమున ప్రవహింపజేసి జన్మము చరితార్థము చేసికొనవలయు నను మా అభీష్టము ఎట్టకేలకు ఇంత కాలమునకు నెరవేరుచున్నది. దీనికి తగిన సర్వవిధ సహకార సంపదను చివరకు స్వరచిత వ్యాఖ్యను కూడ మాకు ప్రచురణకై అనుగ్రహించిన సుధీమణి ఉ. వే. ప్ర. శ్రీమాన్. కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులవారు. వారి అర్హతాఽధికారములను నావంటి సామాన్యుడు చర్చింపబూనుకొనుట సాహసమే గదా.

ఏతద్వ్యాఖ్యా రచనా ముద్రాపణాది కఠిన పరిశ్రమలతో అగకండ వారు నా ప్రార్థనపై మరొక అతి సాహస కార్యమును కూడ చేపట్టినారు. శ్రీభాష్యసార రచనా ముద్రాపణము అనునదే అది. సుమారు రెండు సంవత్సరములు అహోరాత్ర పరిశ్రమచేసి తన్మహా కార్యమునసైతము నెగ్గిన ఆ గురుపండితుని కఠోర కార్యజాతము నావంటి సామాన్య వ్యక్తికి అసాధ్యము - తిరుపతి దేవస్థానమునుండి తన్ముద్రణకై యథేష్ట ద్రవ్యమును సైతము సంపాదించి తెచ్చి మా కడుపులో చల్ల కదలకుండా చేసిన ఆ సాధుశీలుని ఋణము కేవలము మాటలతో తీర్చుకొనలేనిది. పోతనార్యుని ఈ కలకండ పలుకులతో మా గొంతుకూడా కలిపి పలుకుటయే మా పంతు అయినదిగదా. "దీనికిన్ నీకు ప్రత్యుపకృతిన్ గావింపగా నేర నంజలి గావించెద భూసురాన్వయమణీ సద్బంధు చింతామణీ."

గీతాముద్రణకు తగిన సంపద మాకెట్లు లభించునా అను మా ఘనత రచింతను తీర్చుటకై రసఘనమైన తమ ఆర్థిక కైంకర్యము అందించి "మా శుచః" అని పలుకుచు మా వెన్నుతట్టి నిలిచినవారు ఉదారశీలురు కొందరు. ఇట్టి అవకాశము అందించుటకై తన కటాక్షవీక్షణములను మాపై బరపినది ఆండాళ్‌తల్లి. ఆమె ఋణము ఎట్లు తీర్చుకొనుట. "ఋణం ప్రవృద్ధ మివ మే హృదయాన్నాపసర్పతి" గదా.

ఇక నీ గ్రంథ పారయణోపక్రమణమునకై తహతహ లాడు చున్న విజ్ఞలోకమునకు స్వాగతసత్కారము నందించుచు సెలవు తీసికొందునా మరి.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥





శ్రీరస్తు

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ మద్వరవర మునయే నమః

# శ్రీ భగవద్గీతామృతము

## తృతీయ షట్కము



### త్రయోదశాధ్యాయము — క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము.

అర్జున ఉవాచ :—

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ।
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥

తా -: కేశవ; ప్రకృతి పురుషుడు క్షేత్రము క్షేత్రజ్ఞుడు జ్ఞానము జ్ఞేయము అను వీనిని తెలియగోరుచున్నాను.

ప్రథమ షట్కమునందు భగవద్గీతా శాస్త్రమునకు ఉపోద్ఘాత రూపమైన పార్థునియందలి అస్థాన స్నేహ కారుణ్యాదికమునకు నివర్తకము; భగవత్ప్రాప్తి సాధనమైన భక్తియోగమునకు అంగము; ఆత్మస్వరూప యాథాత్మ్యజ్ఞాన పూర్వకమైన కర్మయోగముచే సాధ్యము అయిన ప్రత్యగాత్మ దర్శనము విశదముగ ప్రతిపాదింపబడినది.

ద్వితీయ షట్కమునందు పరమ ప్రాప్య మగు భగవత్ప్రాప్తికి ఉపాయమైన భక్తియోగము విశదముగ ప్రతిపాదింపబడినది. ఇక ఈ తృతీయ షట్కమునందు తొలి రెండు షట్కములయందు వర్ణింపబడిన విషయములే సవిమర్శముగ నిరూపింపబడుచున్నవి. తొలుత త్రయోదశాధ్యాయమున పూర్వము "గతాసూ నగతాసూంశ్చ" (భగ-2-11.) అని ప్రారంభించి ప్రతిపాదింపబడిన "శరీరము-ఆత్మ" అను వీని తత్త్వము విశదీకరింపబడుచున్నది.

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః; క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ 1

అర్థ :- కౌంతేయ = అర్జునా; ఇదం=ఈ; శరీరం = శరీరము; క్షేత్రం + ఇతి=క్షేత్రము అని; అభిధీయతే=చెప్పబడుచున్నది ఏతత్=ఈ శరీరమును; యః=ఎవడు; వేత్తి=తెలిసికొనుచున్నాడో; తం=అట్టివానిని; తత్ + విదః=ఆత్మ స్వరూపము నెఱింగినవారు; క్షేత్రజ్ఞః + ఇతి=క్షేత్రజ్ఞుడు అని; ప్రాహుః=చెప్పుచున్నారు.

తా -: ఆత్మతత్త్వమును తెలిసినవారు ఈ శరీరమును "క్షేత్రము" అని; దీనిని చక్కగ తెలిసినవానిని "క్షేత్రజ్ఞుడు" అని చెప్పుచున్నారు.

అథ త్రయోదశోధ్యాయః

దీపికా-: అథ ప్రథమ షట్కే శాస్త్రావతరణోపోద్ఘాతభూత పార్థగతాఽస్థానస్నేహ కారుణ్యాది నివృత్తి హేతుభూత భగవత్ప్రాప్త్యుపాయభూత భక్తియోగాంగభూత మాత్మయాథాత్మ్యానుసంధానపూర్వక కర్మయోగ సాధ్యం ప్రత్యగాత్మనో దర్శనం సపరికర ముక్తం। ద్వితీయ షట్కే చ తదంగిభూతో భగవత్ప్రాప్త్యుపాయభూత భక్తియోగ స్సపరికరః ప్రతిపాదితః। ఇదానీం తృతీయ షట్కే షట్క ద్వయోదిత మర్థ జాతం విశోధయిష్యన్ - ఆదౌ - గతాసూ నగతాసూంశ్చేత్యాదినా ప్రతిపాదితం శరీరాత్మ తత్త్వం విశోధయితుం భగవానువాచ —

హే కౌంతేయ। ఇదం=దేవోఽహం మనుష్యోహ మిత్యహ మర్థ సామా నాధికరణ్యేన ప్రతీయమానం శరీరం। క్షేత్రమితి=కర్మబీజ ఫలోత్పత్తి హేతుత్వాత్ క్షేత్రమితి। అభిధీయతే=ఆత్మ యాథాత్మ్య విద్భిః ప్రతిపాద్యతే। ఏతత్=శరీరాఖ్యం క్షేత్రం; యః వేత్తి=జానాతి; క్షేత్రజ్ఞ ఇతి, వేద్యాత్ క్షేత్రాద్వేదితాఽన్య ఇతి ప్రాహుః; వదన్తి। యథా కేదారిణా=క్షేత్ర మహం జానామీత్యుక్తే జ్ఞేయాత్ క్షేత్రాత్తత్‌జ్ఞాతాఽన్యః ప్రతీయతే, ఏవం శరీర మహం జానామీత్యనుభవేన జ్ఞేయాచ్ఛరీరాత్తజ్ఞాతాఽన్యః - జ్ఞాతుశ్చ జ్ఞేయం శరీర మన్యదితి స్ఫుటం జ్ఞాయతే। తతఏవ - దేవోఽహం మనుష్యోహం ఇత్యాద్యనుభవో వ్యవినాభూత శరీరశరీరి భావ నిబంధనః యోగ సహ కృత మనోగోచరతయా కేవల చేతసా తదనవభాసేన మోహక ప్రకృతి సన్నిధాన దోషేణ కర్మబలేనాపి లౌకికానాం దేహాత్మా భేద ప్రతీతి రూప ఇతి భావః ॥ 1 ॥

శ్లో॥ క్షేత్రజ్ఞఞ్చాపి మాం విద్ధి; సర్వక్షేత్రేషు భారత।
క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ॥ 2

అర్థ -: హే భారత=ఓ అర్జునా; సర్వక్షేత్రేషు=సకల శరీరముల యందు "ఉండునట్టి"; క్షేత్రజ్ఞం చ + అపి=జీవునికూడ; మాం=నన్నుగా విద్ధి=ఎఱుగుము. క్షేత్రక్షేత్రజ్ఞయోః=శరీరము యొక్కయు, ఆత్మ యొక్కయు; జ్ఞానమ్=తెలియుట; యత్=ఏది కలదో; తత్=అదియే జ్ఞానం=ఉత్తమమైన జ్ఞానము అని; మమ=నాకు; మతం=అభిమతము.

తా -: ఓ అర్జున; సమస్త శరీరములయందు ఉండు జీవుడును నేనే కావున జీవుని గూర్చియు అతని శరీరమును గూర్చియు తెలిసికొనుటయే ఉత్తమమైన జ్ఞాన మని నా అభిమతము.

ఇచట "క్షేత్రజ్ఞం చాఽపి మాం విద్ధి" అనుటచేత క్షేత్రము కూడ పరమాత్మయే అని స్పష్ట మగుచున్నది. వాస్తవమున క్షేత్రము

క్షేత్రజ్ఞుడు పరమాత్మకంటెను భిన్నులు - ఇట్టితరి భగవంతుడు 'ఆ రెండును నేనే' అనుట ఎట్లు పొసగును ? అని సందేహము కలుగవచ్చును - భగవంతుడు చేతనాఽచేతన శరీరకుడు చేతనాఽచేతనాఽంతర్యామి అగుటచే 'చేతనాఽచేతనములు నా యొక్క ప్రకృతి' అనియు "చేతనాఽచేతనములు నేనే" అనియు రెండువిధముల చెప్పవచ్చును. "దేవదత్తుడు లావుగా ఉన్నాడు-దేవదత్తుని శరీరమును చూడు. ఎంత లావుగా ఉన్నదో" అను రెండు వ్యవహారములు యుక్తములే కదా. కావున ఈ శరీర శరీరిభావ సంబంధముచే చేతనాఽచేతనములతో పరమాత్మకు అద్వైతమును ఉపనిషత్తులు భగవద్గీతయు బోధించుచున్న వని విశిష్టాద్వైత సిద్ధాన్తము.

దీపికా :- ఏవం జ్ఞేయత్వేన జ్ఞాతృత్వేన చాఽత్యంత వివిక్తయోరేవ క్షేత్ర క్షేత్రజ్ఞయోః 'భూమి రాపోనలో వాయు' రిత్యాది సప్తమాధ్యాయాది సిద్ధ స్వశేషత్వ ప్రత్యభిజ్ఞాపనేన స్వస్మాదపి వివిక్తతాం జ్ఞాపయ న్నేతద్వివేక జ్ఞానం ప్రశంసతి -

హే భారత ! సర్వక్షేత్రేషు=సర్వేషు శరీరేషు । క్షేత్రజ్ఞం చాపి=అత్ర జాతా వేకవచనం, క్షేత్రజ్ఞాన్ సర్వానపీత్యర్థః । మాం=మదాత్మకాన్ । విద్ధి, 'అపి' శబ్దాత్ క్షేత్రాణ్యపి మదాత్మకాని విద్ధీతి గమ్యతే । యథా సర్వాణి శరీరాణి శరీరిణా మవినాభావేన విశేషణతయా, దేవోఽహం మనుష్యోఽహం-ఇత్యాది సామానాధి కరణ్యేన అను భూయంతే, తథా క్షేత్రక్షేత్రజ్ఞయో రుభయోరపి పూర్వోక్తరీత్యా మదవినాభావేన క్షేత్రజ్ఞం మాం విద్ధి-క్షేత్రం చ మాం విద్ధీత్యాది సామానాధికరణ్య నిర్దేశా వుపపన్నావితి భావః । ఏవం-క్షేత్రక్షేత్రజ్ఞయోః=చేతనా చేతనయోః । యత్ జ్ఞానం=పరస్పర వివిక్తతయా మచ్ఛేషతయా చ యత్ జ్ఞానం తత్-జ్ఞానం మమ మతం । జ్ఞానం ముక్తి హేతుత్వాద్వేదవత్తన్మమాభిప్రేతం ప్రశస్తజ్ఞానం । అన్యత్తు వృధా పాండిత్య మితి భావః । తథాచోక్తం - "తత్కర్మ యన్న బంధాయ సా విద్యా యా విముక్తయే" ఇతి । యద్యపి - "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే । తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి ।" "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్టస్తత

స్తేనాపస్పృతత్వ మేతి" ఇత్యాది కేవలభేదశ్రుతయః "ఐతదాత్మ్యమిదం సర్వం స ఆత్మా. తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" ఇత్యాద్యభేదశ్రుతయ శ్చాపాతతః పరస్పర విరుద్ధాః ప్రతీయంతే, తథాపి "యః పృథివ్యాం తిష్ఠన్ యస్య పృథివీ శరీరం; "య ఆత్మని తిష్ఠన్ యస్యాత్మా శరీరం "ఇత్యాదినా సమస్తచిదచిద్వర్గస్య పరమాత్మశరీరతా ముపపాద్య, "ఏష సర్వభూతాంతరాత్మా ఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" ఇతి నారాయణస్య శరీరిత్వం చాఽభిధాయ సామానాధికరణ్య శ్రుతీనాం భేదశ్రుతీనాం చ శరీరశరీరిభావ మాదాయైకకంఠ్యస్య మమాఽభిమతతయా మచ్ఛరీర తయా వివిక్తతయా జ్ఞాన మేవ ప్రశస్తమితి భావః ॥2॥

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ; యద్వికారి యతశ్చ యత్।
సచ యో యత్ప్రభావశ్చ; తత్సమాసేన మే శృణు॥ 3

అర్థ-: తత్ క్షేత్రం=ఆ శరీరము; యత్+చ=ఏ ద్రవ్యమైనదో; యాదృక్+చ=ఎటువంటిదో: యత్ వికారి=ఏయే పరిణామములుగలదియో; యతః+చ=ఎందుకొరకో; యత్=ఏదియో—సః+చ=అ జీవుడును, యః=ఎవడో; యత్ ప్రభావః=ఏయే ప్రభావములు గలవాడో; తత్=దానిని; సమాసేన= సంగ్రహముగ; మే=నావలన; శృణు=వినుము.

తా-: ఆ శరీరము ఎట్టి ద్రవ్యము?: వేనికి ఆశ్రయము?. దాని పరిణామములు ఎట్టివి?. అది ఎందుకొఱకు ఏర్పడినది?. దాని స్వరూప మేమి?- ఇట్లే ఆ జీవుడును ఏ స్వరూపము గలవాడు?. అతని ప్రభావము ఎట్టిది?. అను ఈ విషయములను సంగ్రహముగా చెప్పెదను. వినుము.

దీపికా-: క్షేత్ర క్షేత్రజ్ఞ జ్ఞానమేవ ప్రపంచయతి. తత్-శరీరాత్మకం। క్షేత్రం। యత్=యత్ ద్రవ్యం। యాదృక్చ=జడోపాదానకం- అజడోపాదానకంవేతి యావత్, యేషా మాశ్రయభూత మిత్యర్థః। యద్వికారి=యద్వికార యుక్తం యే చాస్య వికారా ఇత్యర్థః యతః=యస్మాత్ప్రయోజనాత్,

యత్రప్రయోజన సిద్ధ్యర్థముత్పన్న మిత్యర్థః।యత్=యత్స్వరూప మిత్యర్థః। జడద్రవ్యసంఘాత ఏకదేశోవేత్యర్థః।సచ=క్షేత్రజ్ఞః। యః=యత్స్వరూపః। యత్రప్రభావశ్చ=ప్రకృష్టా భావాః ప్రభావాః।యే ప్రభావా యస్య సః- యత్రప్రభావః=యైర్యైస్స్వభావై ర్యుక్త ఇత్యర్థః।తత్-సర్వం।సమాసేన=సంక్షేపేణ। మే=।మత్తః।శృణు=అకర్ణయ।శృణ్వితి సావధానతాద్యోతనాయ ॥3॥

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం;ఛందోభి ర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్ర పదైశ్చైవ; హేతుమద్భి ర్వినిశ్చితైః॥ 4

అర్థ-: ఋషిభిః=ఋషులచేతను;వివిధైః=అనేక విధములైన;ఛందోభిః=వేదములచేతను; హేతుమద్భిః=హేతువులతోకూడినవియు;వినిశ్చితైః= నిశ్చితార్థములు గలవియునైన; బ్రహ్మసూత్ర పదైః+చ+ఏవ=బ్రహ్మసూత్రము లనెడి పదములచేతను; బహుధా=అనేకవిధములుగా; పృథక్= వేర్వేరుగా; గీతమ్=వర్ణింపబడినది.

తా-: ఋషులచేతను వేదములచేతను హేతుబద్ధముగ అర్థనిర్ణయము గావించు బ్రహ్మసూత్రములచేతను అనేకవిధములుగా శరీరము ఆత్మ భిన్న స్వరూపస్వభావములు గలవి అని నిర్ణయింపబడినది. ఆ విషయమునే సంగ్రహముగ తెలిపెదను-వినుము.

దీపికా-: కుత్ర విస్తరేణోక్తస్య భవతా సంక్షేపణ కథన మిత్యత్రాహ-

ఋషిభిః=పరశరాదిభిః।బహుధా=బహుభిః ప్రకారైః।గీతం=క్షీరనీరవదతిదుర్వివేచతయా బహువిధం వివేచిత మిత్యర్థః। వివిధైః=ఋగ్యజుస్సామాది బహుప్రకారైః।ఛందోభిః=వేదైశ్చ।పృథక్=అసంకీర్ణం యథాతథా। గీతం। హేతుమద్భిః=స్వాభిమతార్థసాధక యుక్తిసంపన్నైః। వినిశ్చితైః= విశేషేణ నిశ్చితార్థైః। బ్రహ్మసూత్రపదైః-బ్రహ్మసూత్రాణి బ్రహ్మసూచకాని, పదాని-పద్యతే=బ్రహ్మజ్ఞానోపయోగితయా ప్రతిపద్యతే క్షేత్రక్షేత్రజ్ఞతత్త్వ

మేభి రితి పదాని, బ్రహ్మసూత్రాణి చ తాని పదాని చ బ్రహ్మసూత్రపదాని, తైః। గీతం "న వియ దశ్రుతేః" "నాత్మా శ్రుతేః" ఇత్యాదినా క్షేత్ర క్షేత్రజ్ఞతత్త్వే భేదే నోపాదాయ "పరాత్తు తచ్ఛ్రుతేః" ఇత్యాదినా తత్స్వ వర్త్యత్వోపపాదనా దిత్యర్థః।ఏవభూతం తత్ క్షేత్రక్షేత్రజ్ఞ మాహాత్మ్యం సమాసేన శృణ్వితి పూర్వేణాఽన్వయః ॥4॥

శ్లో॥ మహాభూతా న్యహంకారో;బుద్ధి రవ్యక్త మేవ చ।
ఇంద్రియాణి దశై కం చ;పంచ చేంద్రియ గోచరాః॥ 5

అర్థ-: మహాభూతాని =పంచమహాభూతములు; అహంకారః =భూతాది యైన అహంకారతత్త్వము; బుద్ధిః =మహత్తత్త్వము; అవ్యక్తః+ఏవ చ= మూలప్రకృతియు;దశ =పది;ఏకంచ =ఒకటియు నైన;ఇంద్రియాణి =ఇంద్రియములు; ఇంద్రియ గోచరాః =ఇంద్రియములకు విషయములైన;పంచ చ =శబ్దాదులు అయిదును.

దీపికా-: అథ భగవానేవ తత్ క్షేత్రమితి స్వేనైవోపదిష్టా నర్థాన్వివేచయతి-

ఏతత్ క్షేత్రం = శరీరాత్మకం క్షేత్రం।మహాభూతాని = పృథివ్యాదీని పంచ అహంకారః = తత్కారణప్రకృతి పరిణామవిశేషః। బుద్ధిః = మహత్తత్త్వం। అవ్యక్త మేవ చ =ప్రకృత్యాద్యాకాశపర్యంత జడమయ మిత్యర్థః। అనేన యదతి ప్రథమార్ధనిష్టోఽంశో వివేచితః। ద్వితీయం యాదృగిత్యేతదంశం వివేచయతి। దశ-జ్ఞానేంద్రియ కర్మేంద్రియాత్మకాని ఇంద్రియాణి। ఏకం చ మనశ్చ। పంచ ఇంద్రియ గోచరాశ్చ =ఇంద్రియ విషయాశ్శబ్దాదయశ్చ। ఏతద్రూపం క్షేత్ర మిత్యన్వయః, తదాశ్రయభూత మిత్యర్థః ॥5॥

శ్లో॥ ఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనాధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥ 6

అర్థ-: ఇచ్ఛా=కోరిక, ద్వేషః=ద్వేషము సుఖం=సుఖము, దుఃఖం=దుఃఖము; చేతన+ఆధృతిః=జీవాత్మల సుఖదుఃఖాది భోగమునకు ఆధారమైన;

సంఘాతం:=పంచభూతముల సంయోగము; క్షేత్రం=క్షేత్రము అనబడుచున్నది. ఏతత్=(ఇట్లు)ఈ క్షేత్రము; సవికారం=(దాని)కార్యములతో సహ; సమాసేన= సంగ్రహముగ; ఉదాహృతం= చెప్పబడినది.

తా॥-: పృథివి అప్పు వాయువు తేజస్సు ఆకాశము అనెడి పంచ మహాభూతములు భూతాదియగు అహంకారంతత్త్వము మహత్తత్త్వము మూలప్రకృతి త్వక్ (చర్మము) చక్షుస్ శ్రోత్ర జిహ్వ ఘ్రాణములు అనెడి అయిదు జ్ఞానేంద్రియములు వాక్ పాణి పాద పాయు ఉపస్థలు అనెడి అయిదు కర్మేంద్రియములు మనస్సు (మనస్సుతో కలిపి ఇంద్రియములు పదునొకండు) శబ్ద స్పర్శ రూప రస గంధములు అనెడి అయిదు ఇంద్రియముల విషయములు ఇచ్ఛాద్వేషములు-సుఖదుఃఖములు- జీవులు సుఖదుఃఖాదుల ననుభవించుటకు ఆధారమైన పంచభూత సంయోగమును 'క్షేత్రము' అనబడుచున్నది. ఇట్లు క్షేత్రమును గూర్చియు క్షేత్ర కార్యములను గూర్చియు సంగ్రహముగ తెలిపితిని- ఇచట-

1. "మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ" అని శరీరారంభక ద్రవ్యములు
2. 'ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియ గోచరాః॥ అని శరీరము నాశ్రయించియుండు తత్త్వములు
3. 'ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం" అని క్షేత్రకార్యములు
4. చేతనాధృతిః' అని శరీర ప్రయోజనము
5. 'సంఘాతః' అని శరీరస్వరూపము చెప్పబడినవి - కావున 'తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్' అను అయిదు ప్రశ్నలకు సమాధానము లభించినది

దీపికా-: యద్వికారీతి తృతీయాంశం వివేచయితి (ఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖ మితి) తత్ క్షేత్రం ఏతత్కార్య మిత్యర్థః। యదితి నిర్దిష్టం పంచమాంశం వివేచయితి (సంఘాత ఇతి) పూర్వోక్త జడ సంఘాత రూపం తత్

తత్ క్షేత్ర మిత్యర్థః।యత ఇత్యుద్దిష్టం చతుర్థ మంశం వివేచయతి (చేతనాధృతి రితి). చేతనస్య=భోక్తు రాత్మనః, ఆధృతిః=ఆధారః।సుఖదుః ఖానుభవార్థమయనభూతం తత్ క్షేత్ర మిత్యన్వయః।అనేక శరీరస్య సుఖదుః ఖానుభవ ఏవ ప్రయోజన మిత్యుక్తం భవతి। ఏవం ఏతత్ క్షేత్రం। సమా సేన=సంక్షేపేణ। సవికారం - సకార్యం సస్వభావం చ। ఉదాహృతం=ఉప న్యస్తమ్ ॥6॥

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ, మహింసా క్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥ 7

అర్థ-: అమానిత్వం=గర్వము లేకుండుట; అదంభిత్వం=డంభము లేకుండుట; అహింసా=పరులను హింసింపకుండుట; క్షాంతిః=ఓర్పు; ఆర్జ వం=ఋజువర్తనము; ఆచార్య + ఉపాసనం=ఆచార్యుని సేవించుట; శౌచం=పరిశుద్ధత; స్థైర్యం=స్థిరత్వము; ఆత్మ వినిగ్రహః=మనోనిగ్రహము

దీపికా-: అథ క్షేత్రకార్యేష్వాత్మజ్ఞాన సాధనతయోపాదేయాన్ గుణా నాహ-

అమానిత్వం - మానః - విద్యావిత్తాఽభిజనాది జనితగర్వః, తద్రహి తత్వం। అదంభిత్వం-దంభః-ధార్మికత్వ యశఃప్రయోజనతయా ధర్మాను ష్ఠానం, తద్రహితత్వం। అహింసా=మనో వాక్కాయైః పరపీడాఽనాచరణం। క్షాంతిః=పరైః పీడ్యమానస్యాపి తాన్ ప్రతి ద్వేషరహితత్వం।ఆర్జవం=వాఙ్మ నఃకాయానా మేకరూపతా। ఆచార్యోపాసనం=ఆత్మజ్ఞాన ప్రదాయి న్యాచా ర్యే ప్రణిపాత పరిప్రశ్న సేవాది నిరతత్వం। శౌచం=అశుచిత్వ రాహిత్యం। రాగాదికం మనసోఽశుచిత్వం, అనృతంవాచోఽశుచిత్వం, అభక్ష్య భక్షణాది కం కాయస్యాశుచిత్వం, తద్రహితత్వ మిత్యర్థః। స్థైర్యం-అధ్యాత్మశాస్త్రోక్తే ష్వర్థేషు నిశ్చలత్వం। ఆత్మవినిగ్రహః-ఆత్మనః=మనసః, వినిగ్రహః=ప్రత్య గాత్మ వ్యతిరిక్తవిషయేభ్యో నివర్తనం ॥7॥

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య; మనహంకార ఏవ చ।
జన్మమృత్యు జరా వ్యాధి; దుఃఖ దోషానుదర్శనమ్॥ 8

అర్థ-: ఇంద్రియ + అర్థేషు = చక్షురాదీంద్రియములకు సంబంధించిన రూపాదివిషయములయందు. వైరాగ్యం = వైరాగ్యము; అనహంకారః + ఏవ చ = దేహాత్మాఽభిమానము లేకుండుటయు; జన్మ........దోష + అనుదర్శనం = జన్మము మృత్యువు జర వ్యాధి- వీనియందలి దుఃఖము అనెడి దోషమును దర్శించుట. ఈ జన్మాదులు శరీరసంబంధముచే ఏర్పడునవి.

దీపికా-: ఇంద్రియార్థేషు - ఇంద్రియాణాం = చక్షురాదీనాం, అర్థేషు = విషయేషు రూపాదిషు సాంస్పర్శికేషు। వైరాగ్యం = సదోషత్వానుసంధానేన విరక్తిః। అనహంకారః = దేహాత్మాభిమాన రహితత్వం। ఇదముపలక్షణం. అస్వే స్వత్వబుద్ధిరహితత్వ మప్యనేన సంగృహీతం। జన్మమృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనం-జన్మ మృత్యు జరా వ్యాధిషు శరీరసంబంధిషు దుఃఖరూపస్య దోషస్య, అనుదర్శనం = పునః పునరాలోచనం ॥8॥

శ్లో॥ అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టాఽనిష్టోపపత్తిషు॥ 9

అర్థ-: అసక్తిః = (గృహారామ క్షేత్రాదులయందు) ఆసక్తి లేకుండుట; పుత్రదారగృహ + ఆదిషు = పుత్రులు భార్య గృహము మున్నగువానియందు; అనభిష్వంగః = అతిప్రీతి లేకుండుట; ఇష్ట + అనిష్ట + ఉపపత్తిషు = ఇష్టములు అనిష్టములు (మన సంకల్పముచే) ప్రాప్తించినపుడు; నిత్యం = ఎల్లపుడు; సమచిత్తత్వం చ = హర్షోద్వేగములు లేని మనస్సు కలిగియుండుట.

దీపికా-: అసక్తిః = గృహారామ క్షేత్రాదిష్వాభిమానకే ష్వాసక్తి రహితత్వం। నను గృహాద్యుపకరణేషు సంగవిరహే కథం గృహస్థ ధర్మనిష్పత్తిరిత్య త్రాహ (అనభిష్వంగ ఇతి) పుత్రదారగృహాదిషు అనభిష్వంగః = శాస్త్రోక్తధర్మ సాధనత్వేన వినా స్వభోగ సాధనత్వానుసంధానేనాఽతిప్రీతి రహితత్వ మిత్యర్థః। ఇష్టానిష్టోపపత్తిషు-ఇష్టానిష్టానాం సాంకల్పికానాం, ఉపపత్తిషు = ప్రాప్తిషు నిత్యం। సమచిత్తత్వం చ = ఏకరూప చిత్తత్వం చ, హర్షోద్వేగరహితత్వం చేతియావత్ ॥9॥

శ్లో॥ మయి చానన్యయోగేన, భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ; మరతి ర్జనసంసది॥ 10

అర్థ॥-: మయి= సర్వేశ్వరుడవైన నాయందు; అనన్యయోగేన= ప్రయోజనాంతరస్పర్శలేని యోగముచే; అవ్యభిచారిణీ= అతిస్థిరమైన; భక్తిః + చ= భక్తియు; వివిక్త దేశసేవిత్వం =పవిత్రమైన ఏకాంత ప్రదేశమున వసించుట; జనసంసది =జనసముదాయము (గల ప్రదేశము)న; అరతిః= ప్రీతి లేకుండుట.

దీపికా-: అనన్యయోగేన - అన్యయోగః-ప్రయోజనాంతర స్పర్శః, తదభావేన। మయి= సర్వేశ్వరే। అవ్యభిచారిణీ - న వ్యభిచరితుం-దేవతాంతరం స్ప్రష్టుం, శీలమస్యా ఇత్యవ్యభిచారిణీ= అతిస్థిరా భక్తిశ్చ;వివిక్త దేశ సేవిత్వం= పవిత్రదేశ సేవిత్వం। జనసంసది= అసాత్త్వికసభాయాం, అరతిః= అప్రీతిః ॥10॥

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థచిన్తనమ్।
ఏతజ్జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా॥ 11

అర్థ-: అధ్యాత్మజ్ఞాననిత్యత్వం= ఆత్మజ్ఞానమున నిష్ఠ కలిగియుండుట; తత్త్వజ్ఞాన + అర్థచింతనం= ఆత్మయాథాత్మ్యజ్ఞానముకొఱకు చింతించుట; ఏతత్ =ఇది; జ్ఞానం + ఇతి= జ్ఞానము అని; ప్రోక్తం= చెప్పబడినది; అతః= దీనికంటే; అన్యథా= భిన్నముగా; యత్= ఏదిగలదో (మానిత్వదంభిత్వాదికము) తత్= అది; అజ్ఞానం= అజ్ఞానము.

తా-: అమానిత్వము మొదలు తత్త్వజ్ఞానార్థ చింతనమువరకు గల గుణములు ఆత్మజ్ఞాన సాధకములు. వీనికంటె వ్యతిరిక్తములైన మానిత్వ దంభిత్వాదులు ఆత్మజ్ఞాన విరోధులు. ఇచట జ్ఞానము అనగా ఆత్మజ్ఞాన సాధకము అని యర్థము. (జ్ఞాయతే అనేనేతి జ్ఞానమ్)

దీపికా-: అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం = ఆత్మని = వివిక్తాత్మవిషయే, యజ్ఞానం త దధ్యాత్మజ్ఞానం, తస్మి న్నిత్యత్వం=తదేకనిష్ఠత్వం। తత్త్వ జ్ఞానార్థ చింతనం - తత్త్వజ్ఞానం=ప్రత్యగాత్మ యాత్మథాజ్ఞానం, అర్థః=ప్రయోజనం, యస్య తత్, ఏవం భూతం చింతనం=ఆలోచనం। ఏతత్=అమానిత్వాది ప్రత్యగాత్మాలోచన పర్యంతం క్షేత్రకార్యజాతం।జ్ఞానమితి=జ్ఞాయతే ప్రత్యగాత్మతత్త్వ మనేనేతి జ్ఞానం-ప్రత్యగాత్మ జ్ఞానసాధనం,తదితి।ప్రోక్తం అతః=తస్మాత్।అన్యథా=అన్యత్।యత్=క్షేత్రకార్యం మానిత్వ దంభిత్వాది।తత్।అజ్ఞానం=ఆత్మజ్ఞాన విరోధీత్యర్థః ॥11॥

శ్లో॥ జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి; యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే।,
అనాది మత్పరం బ్రహ్మ; న సత్త న్నాఽసదుచ్యతే॥ 12

అర్థ-: జ్ఞేయం=అమానిత్వాది గుణములచే పొందదగినదైన,యత్=ఏ జీవాత్మ స్వరూపము గలదో; తత్=దానిని, ప్రవక్ష్యామి=విశదీకరింతును. యత్=దేనిని; జ్ఞాత్వా=తెలిసికొని; అమృతం=జరామరణాది రహితమైన పరిశుద్ధాత్మస్వరూపమును; అశ్నుతే=పొందుచున్నాడో-తత్=అది; అనాది=ఉత్పత్తి వినాశములు లేనిది. మత్+పరం=నేనే శేషిగా గలది(నాకేశేషభూత మైనది)- బ్రహ్మ=బృహత్త్వ గుణము గలది. (అపరిచ్ఛిన్న జ్ఞానము గలది). న సత్=కార్యదశ లేనిదిగను; న+అసత్=కారణదశ లేనిదిగను; ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా-: అమానిత్వాది గుణములచే పొందదగిన జీవాత్మస్వరూపమును చక్కగా తెలిసికొనినచో జరామరణాదిరహితము భగవచ్ఛేషభూతము అపరిచ్ఛిన జ్ఞానానన్దైక స్వరూపము కార్యకారణ దశాశూన్యము అయిన పరిశుద్ధాత్మస్వరూపమును పొందును.

దీపికా-: పూర్వం "క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమే"తి జ్ఞేయతయా ప్రక్రాంతయోః క్షేత్రక్షేత్రజ్ఞయోర్మధ్యే క్షేత్రస్వరూపం శోధితం. అథాఽవశిష్టస్య వేదితుః స్వరూపం శోధయతి-

జ్ఞేయం=ఉక్తా౽మానిత్వాదిభిః క్షేత్ర వివిక్తతయా వేద్యం। యత్=ప్రత్యగాత్మ స్వరూపం తత్। ప్రవక్ష్యామి=ప్రకృష్టం యథాతథా కథయిష్యామి। ఏవం శ్రోతు స్సావధానతా ద్యోతనాయ ప్రవక్ష్యామీతి ప్రతిజ్ఞాయ ఆదరాతిశయాయ ఫలం నిర్దిశతి (యదితి) యత్=ప్రత్యగాత్మ స్వరూపం। జ్ఞాత్వా=తత్త్వతో విజ్ఞాయ। అమృతం=జరామరణాది విరహితం పరిశుద్ధాత్మ స్వరూపం। అశ్నుతే=ప్రాప్నోతి। అనాది-న విద్యతే ఆదిః=ఉత్పత్తిః యస్య తత్। ఇద ముపలక్షణం। అనంతమపి। మత్పరం=అహమేవ, పరః=శేషీ యస్య తత్, మచ్ఛేషభూత మిత్యర్థః। అనేన సప్తమాధ్యాయే "ఇత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం। జీవభూతా" మిత్యత్ర 'మే' ఇతి షష్ఠ్యా నిర్దిష్ట స్సంబంధ శ్శేషత్వరూప ఇతి శోధితం భవతి। బ్రహ్మ=సంసార దశాయాం కర్మణా సంకోచేపి - 'సచానన్త్యాయ కల్పత' ఇతి శ్రుతి సిద్ధా౽పరిచ్ఛిన్న జ్ఞాన స్వభావం। న సత్=కర్మకృత కార్యావస్థావత్త్వే౽పి స్వరూపతః కార్యావస్థా రహితం। నా౽సత్=కారణావస్థారహితం చ। ఉచ్యతే='న జాయతే మ్రియతే వా విపశ్చి'దిత్యాది శ్రుతిభి రిత్యర్థః ॥ 12 ॥

శ్లో॥ సర్వతః పాణిపాదం త త్సర్వతో౽క్షి శిరోముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥ 13

అర్థ-: తత్=ఆ పరిశుద్ధమైన జీవాత్మ స్వరూపము; సర్వతః=అంతట; పాణిపాదం=చేతులు కాళ్ళు కలది-సర్వతః=అంతట; అక్షి శిరః+ముఖం=నేత్రములు శిరస్సు ముఖము గలది. సర్వతః=అంతట; శ్రుతిమత్=చెవులు గలది; లోకే=లోకమునందు; సర్వం=సమస్తమును; ఆవృత్య=వ్యాపించి; తిష్ఠత్=ఉన్నది.

తా-: ముక్తిదశయందు జీవాత్మ పరమాత్మతో పరమ సామ్యమును పొందుటచే కరణ కళేబరములు లేకున్నను వాని కార్యముల నన్నింటిని చేయగలిగియుండును. అసంకుచిత జ్ఞానావిర్భావముచే అంతట వ్యాపించియుండును. జగత్సృష్ట్యాది కర్తృత్వము తప్ప తక్కిన అన్ని గుణములు పరమాత్మతో సమానముగ గలిగియుండునని భావము.

దీపికా-: తత్=పరిశుద్ధాత్మ స్వరూపం। సర్వతః పాణిపాదం-సర్వతః-సర్వేషు దేశేషు, పాణయః పాదాశ్చ-యస్య తత్। అత్ర పాణిపాద గ్రహణం కర్మేంద్రియ మాత్రోపలక్షణం। సర్వ దేశగత కర్మేంద్రియ కార్యశక్త మిత్యర్థః। సర్వతోఽక్షిశిరోముఖం-సర్వతః=సర్వదేశేషు, అక్షీణి=శిరాంసి ముఖాని చ యస్య తత్। సర్వతః=సర్వదేశేషు। శ్రుతిమత్=శ్రోత్రయుక్తం। అత్రాఽక్షి శ్రుతి గ్రహణం జ్ఞానేంద్రియ మాత్రోపలక్షణం। సర్వదేశవ్యాపి సర్వ జ్ఞానేంద్రియ మూర్ధముఖాది కార్య శక్తమిత్యర్థః। అతఏవ। లోకే। సర్వం=విషయ జాతం। ఆవృత్య=జ్ఞానద్వారాఽధిష్ఠాయ। తిష్ఠతి। అయం భావః-యథా 'అపాణి పాదో జవనో గ్రహీతా' 'పశ్యత్యచక్షుస్స శృణోత్యకర్ణః' ఇతి కర్మేంద్రియ జ్ఞానేంద్రియా ద్యభావేఽపి పరమాత్మా తత్కార్యశక్త ఇత్యుపపన్నం, తథా జీవస్యాపి ముక్తిదశాయాం 'నిరంజనః పరమం సామ్య ముపైతీ'తి శ్రుత్యా 'మమ సాధర్మ్య మాగతా' ఇతి వక్ష్యమాణ స్వసూక్త్యా చ జగద్వ్యాపార వర్జ సర్వశక్త్యాది ప్రతిపాదనేన, "స చానంత్యాయ కల్పత" ఇతి వ్యాపక జ్ఞానావిర్భావోక్త్యా చ పరమాత్మవత్సర్వ వస్తుజాత వ్యాప్తి ర్యుక్తైవేతి ॥ 13 ॥

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ, నిర్గుణం గుణ భోక్తృ చ॥ 14

అర్థ-: సర్వ+ఇంద్రియ గుణ=ఆభాసం=(ఆ పరిశుద్ధాత్మ స్వరూపము) చక్షురాది సకలేంద్రియ వృత్తులచేతను విషయములను తెలిసికొన సమర్థమైనది; సర్వ+ఇంద్రియ వివర్జితం=చక్షురాది సకలేంద్రియములు లేనిది, (ఇంద్రియ వ్యాపారములు లేకయే విషయములను గ్రహింపగలది). అసక్తం=(దేవాది దేహములతో) సంబంధము లేనిది- సర్వభృత్+చ+ఏవ=దేవాది సమస్త దేహములను ధరింపసమర్థమైనది. నిర్గుణం=స్వభావతః సత్త్వాది గుణములతో సంబంధము లేనిది - గుణభోక్తృ చ=సంసార దశయందు సత్త్వాదిగుణములను అనుభవించునదియు నైయున్నది.

తా-: పరిశుద్ధ జీవాత్మ స్వరూపము ఇంద్రియముల సంబంధము ఉన్నను లేకున్నను విషయములను గ్రహింపగలిగినది వాస్తవమున దానికి

దేహాది సంబంధము లేకున్నను దేవాది దేహములను ధరించునది. సత్త్వాది గుణములతో సంబంధము లేనిదైనను సంసారదశయందు వానిని అనుభవించునది. ఇంద్రియములతోను దేవాది దేహములతోను సత్త్వాది గుణములతోను జీవాత్మకు కర్మమూలకముగా సంబంధము ఏర్పడుచున్నది అని భావము.

దీపికా-: సర్వేన్ద్రియగుణాభాసం-సర్వేషాం - విషయాణాం, ఇంద్రియగుణైః=చక్షురాది వృత్తిభిః, అభాసః=ప్రకాశః, యస్య తత్; ఇంద్రియ వృత్తిభిరపి విషయాన్ జ్ఞాతుం సమర్ధ మిత్యర్ధః।సర్వేంద్రియ వివర్జితం-స్వభావత స్సర్వేంద్రియై ర్వివర్జితం।ఇంద్రియవ్యాపార నైరపేక్ష్యేణాపి సర్వ సాక్షాత్కార సమర్ధ మిత్యర్థః। అసక్తం=స్వభావతో దేవాది దేహసంగరహిత మిత్యర్థః।అథాపి।సర్వభృచ్చైవ - ఐచ్ఛిక దేవాది సర్వదేహ భరణసమర్థం చైవ 'స ఏకధాభవతి ద్విధా భవతీ' త్యాదిశ్రుతేః; నిర్గుణం - స్వభావతో గుణసంబంధ రహితం.గుణకార్య ప్రాకృతభోగ రహిత మిత్యర్థః।అథాపి।గుణ భోక్తృ చ-సంసారదశాయాం కర్మాధీన ప్రాకృత గుణభోగ సమర్థం చేత్యర్థః।

శ్లో॥ బహి రన్తశ్చ భూతానా మచరం చర మేవ చ।
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం; దూరస్థం చాన్తికే చ తత్॥ 15

అర్ధ-: భూతానాం= (ఆ పరిశుద్ధాత్మస్వరూపము) పంచభూతములయొక్క; బహిః=వెలుపల; అంతః+చ=లోపలను (గలదు). అచరం=(స్వభావతః) చలనము లేనిది - చరం+ఏవ చ=దేహసంబంధముచే (చలించునదియును) తత్=ఆ ఆత్మస్వరూపము; సూక్ష్మత్వాత్=మిక్కిలి సూక్ష్మమైన దగుటవలన;అవిజ్ఞేయం=(శరీరమున ఉన్నను.)తెలియ శక్యముకానిది. తత్= ఆ ఆత్మతత్త్వము; దూరస్థం=(అమానిత్వాది గుణములు లేనివారికి) దూరమున నుండునది. అంతికే చ=(ఆ గుణములు గలవారికి)సమీపమున నుండునదియును.

తా-: జీవాత్మ పృథివ్యాది పంచభూతముల (శరీరముల) వెలుపల లోపల నుండును. శరీరసంబంధము ఉన్నపుడు చలనముగలిగియు అది

లేనపుడు చలనము లేకయు ఉండును. శరీరమునందు ఉన్నను అది (యోగులకుతప్ప) సామాన్యులకు భాసింపదు-అమానిత్వాది గుణములు గల వారికి సులభ గ్రాహ్యముగను అవి లేనివారికి దుర్గ్రహముగను ఉండును.

దీపికా-: తత్=వివిక్తాత్మ తత్త్వం। భూతానాం=పృథివ్యాదీనాం। బహిః=బహిర్దేశే। వర్తతే। పృథివ్యాదీని భూతాని విహాయాఽశరీరం బహిస్తిష్ఠతీత్యర్థః। అంతశ్చవర్తతే "జక్షత్క్రీడన్ రమమాణ స్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వే"త్యుక్తప్రకారేణ స్వేచ్ఛయా ప్రాకృత భూతాంతర్వర్తిత్వేనాపి తిష్ఠతీత్యర్థః। తథా స్వభావతః అచరం చ। చర మేవ చ-దేహిత్వ దశాయాం చర మేవ చ। తత్-ఏవం సర్వశక్తి సర్వజ్ఞమపి వివిక్తాత్మ స్వరూపం। సూక్ష్మత్వాత్=శరీరే వర్తమానత్వే వ్యతి సూక్ష్మత్వాత్। అవిజ్ఞేయం=యోగాఽసంస్కృత మనోభి స్సంసారిభిః పృథక్త్వేన దుర్విభావ్యం। అతఏవ। తత్, దూరస్థం=అమానిత్వాది గుణవిరహిణాం యోజనతోఽవ్యంతరిత మివ తిష్ఠతి। తదేవ। అంతికే చ=అమానిత్వాది గుణోపేతానామతిసన్నిధౌ భవతి ॥ 15 ॥

శ్లో॥ అవిభక్తం చ భూతేషు; విభక్త మివ చ స్థితమ్।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం; గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

అర్థ-: **భూతేషు**=శరీరములయందు, **అవిభక్తం చ**=(జ్ఞాతృత్వరూపముచే) ఒకే రీతిగ నుండునదియు. విభక్తం+ఇవ=(ఈ విషయము తెలియనివారికి దేవాద్యాకారములచే నానారూపముల) విభజింపబడినదానివలె; స్థితం చ=ఉండునదియునైన; తత్=ఆ జీవతత్త్వము; భూతభర్తృ=భూతములను (శరీరరూపమున పరిణమించిన పృథివ్యాది భూతములను) భరించునదిగ (పోషించునదిగ) గ్రసిష్ణు=(ఆ భూత వికారములైన అన్నాదులను) గ్రసించునదిగ; ప్రభవిష్ణు చ=(ఆ గ్రసింపబడిన అన్నాదులను శుక్లాది రూపమున) ప్రభవింపజేయునదిగను, జ్ఞేయం=తెలియదగియున్నది.

తా-: జీవతత్త్వము అన్ని శరీరములయందును ఒకే రూపమున నుండును - అనగా జ్ఞానైకాకారముగా నుండును. కాని ఈ విషయము

తెలియనివారికి అది దేవ మనుష్యాధి రూపములతో నానావిధములుగ ఉన్న ట్లు స్ఫురించును. పంచభూత వికారములైన శరీరములను ధరించునది. అన్నాదులను గ్రసించునది పునరుత్పత్తికై భుజింపబడిన అన్నాదులను శుక్లాదిరూపమున పరిణమింపజేయునదియు ఈ జీవతత్త్వమే.

దీపికా-: భూతేషు=శరీరాత్మనా పరిణతేషు పృథివ్యాదిషు। అవిభక్తం చ=విదుషాం జ్ఞాతృత్వైకాకారత యైకరూపం। విభక్త మివ చ=అవిదుషాం-దేవోఽహం మనుష్యోఽహ మిత్యాదినా దేవాద్యాకారేణ నానారూప మివ చ స్థితం। ఏవం విలక్షణం శుద్ధరూప ముపవర్ణ్య విశిష్ట రూపస్యాపి క్షేత్రజ్ఞస్య ప్రకరణారంభ ఇవ క్షేత్రా ద్భేదం దర్శయతి (భూతేతి) తత్=జీవతత్త్వం। భూతభర్తృ=భూతానాం=శరీరాత్మనా పరిణతానాం పృథివ్యాదీనాం। భర్తృ=పోషకం। జ్ఞేయం=జ్ఞాతుం శక్యం। అనేన పోష్యా త్పోషకస్య భేద స్సిద్ధః। గ్రసిష్ణు=ఆత్మనా పరిణతానాం భూతానాం గ్రసనశీలం। జ్ఞేయం। అనేన గ్రస్యమానాద్ గ్రసితు ర్భేదః। ప్రభవిష్ణు చ=భక్షితానాం రూపాంతరేణోత్పాదనం ప్రభవః, తచ్ఛీలం=తత్కారణం చ=జ్ఞేయం। అన్నాదీనాం పరిణామా దపృథ్గాంతరం తత్కారణ మాత్మతత్త్వమితి సిద్ధ్యతి। మృతశరీరే భరణ గ్రసన ప్రభవానా మదర్శనం తేషాం జీవైకహేతుకత్వా దిత్యవగంతవ్యమ్ ॥16॥

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతి; స్తమసః పర ముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం; హృది సర్వస్య విష్ఠితమ్॥ 17

అర్థ-: తత్ = ఆ జీవతత్త్వము; జ్యోతిషాం+అపి=సూర్యాది జ్యోతిస్సులకును; జ్యోతిః=ప్రకాశకము. తమసః=మూలప్రకృతికంటెను; పరం=భిన్నమైనదిగ; ఉచ్యతే=చెప్పబడుచున్నది. జ్ఞానం=జ్ఞానైకాకార మైనదియు; జ్ఞానగమ్యం=ఆత్మజ్ఞాన సాధనములైన అమానిత్వాదులచే పొందదగినదియు; జ్ఞేయం=తెలిసికొనదగినదియు; సర్వస్య=సమస్త ప్రాణులయొక్క; హృది=హృదయమున - విష్ఠితం=విశేషించి సన్నిహితమై యుండునదియు నగుచున్నది.

తా-: సూర్యాది జ్యోతిస్సులు పదార్థములను ప్రకాశింపజేయగా అట్టి సూర్యాదిజ్యోతిస్సులను కూడ ప్రకాశింపజేయునది ఆత్మతత్త్వము - అది

మూలప్రకృతికంటె భిన్నమైనది. జ్ఞానైకాకారము - అవశ్యము తెలియదగినది. అమానిత్వాది సాధనములచే పొందదగినది - సకలప్రాణుల హృదయములయందు భోక్తగ స్వస్వరూపముతో నుండునది.

దీపికా-: తత్=ఆత్మతత్త్వం। జ్యోతిషా మపి = ప్రకాశకానాం - దీపాదిత్యాదీనా మపి। జ్యోతిః=ప్రకాశకం. దీపాఽదిత్యాదిః స్వప్రభాద్వారా ఘటాదిక మివ ప్రభాస్థానీయ స్వజ్ఞానద్వారా దీపాదిత్యాదికమ ప్యాత్మా ప్రకాశయ తీత్యర్థః। తమసః=మూలప్రకృతేః। పరం=విశిక్తం ఉచ్యతే=ఆత్మతత్త్వవిద్భిః ప్రతిపాద్యతే। అత ఏవ। జ్ఞానగమ్యం=జ్ఞాయతే ఆత్మతత్త్వ మేభిరితి జ్ఞానాని=జ్ఞానసాధనాని,అమానిత్వాదీని, తై ర్గమ్యం=ప్రాప్యం। జ్ఞానం=జ్ఞానైకాకారం। జ్ఞేయం=అనుసంధేయం। సర్వస్య=లోకస్య। హృది=హృద్దేశే। విష్ఠితం=విశేషేణ సన్నిహితం ॥17॥

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం, జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏత ద్విజ్ఞాయ; మద్భావా యోపపద్యతే॥ 18

అర్థ-: ఇతి=ఇట్లు, క్షేత్రం= శరీరతత్త్వము. జ్ఞానం= ఆత్మజ్ఞానసాధనమైన అమానిత్వాదికము, తథా=అట్లు; జ్ఞేయం చ=జీవయాథాత్మ్యము సమాసతః= సంగ్రహముగ; ఉక్తం=చెప్పబడినది ఏతత్=ఈ మూడింటిని= విజ్ఞాయ= తెలిసికొని; మత్+భక్తః= నా భక్తుడైనవాడు; మత్+భావాయ= నా స్వభావమును (అసంసారిత్వము) పొందుటకు; ఉపపద్యతే= తగినవాడగుచున్నాడు.

తా-: శరీరము ఆత్మ ఆత్మప్రాప్తి సాధనము అను ఈ మూడింటి యథార్థ స్వరూపమును చక్కగా తెలిసినవాడు భగవద్భక్తుడై మోక్షార్హుడు అగుచున్నాడు.

దీపికా-: క్షేత్ర క్షేత్రజ్ఞ యాథాత్మ్య ముపసంహర న్నుక్తస్య ఫలం దర్శయతి-

ఇతి =పూర్వోక్త రీత్యా। క్షేత్రం= శరీరతత్త్వం। తథా। జ్ఞానం= జ్ఞాయతే ఆత్మతత్త్వ మనేనేతి జ్ఞానం - అమానిత్వా ద్యాత్మయాథాత్మ్య జ్ఞానసాధనం।జ్ఞేయం చ =క్షేత్రజ్ఞతత్త్వం చ। సమాసతః =సంక్షేపేణ। ఉక్తం।ఏతత్ = త్రితయం। విజ్ఞాయ। మద్భక్తః=వివిక్తాత్మజ్ఞానానుకూల భక్తిమాన్। మద్భావాయ=మమ యోభావః - స్వభావః - అసంసారిత్వం, తస్మై। ఉపపద్యతే= ఉపపన్నో భవతి। తతస్త్రితయ జ్ఞానేన ముక్తియోగ్యో భవతీత్యర్థః ॥18॥

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ, విద్ధ్యనాదీ ఉభా వపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ; విద్ధి ప్రకృతి సంభవాన్॥ 19

అర్థ-: ప్రకృతిం=ప్రకృతిని; పురుషం చ+ఏవ=జ్ఞాతయైన ఆత్మను; ఉభౌ+అపి= (అన్యోఽన్యము కలిసియున్న ఈ) రెంటిని, అనాదీ=అనాదిగా (కలిసి) ఉన్నవానినిగ; విద్ధి=తెలిసికొనుము. వికారాన్+చ= (బంధహేతువులైన ఇచ్ఛాద్వేషాది) దోషములను; గుణాన్+చ+ఏవ=అమానిత్వాది గుణములను; ప్రకృతి సంభవాన్=ప్రకృతి(శరీరము) వలన కలిగినవానినిగ; విద్ధి=ఎఱుగుము.

తా-: అనాదిగ ఈ ప్రకృతి పురుషులు కలిసియుండి పరస్పరము సహకరించుకొనుచున్నారు. ప్రకృతి శరీరరూపమున పరిణమించి పురుషునిలో రాగద్వేషాదులను కలిగించి బంధహేతువు- అమానిత్వాది సద్గుణములను కలిగించి మోక్షహేతువు అగుచున్నది.

దీపికా-: అథాత్యంత వివిక్తయోః ప్రకృత్యాత్మనో రనాది సంసర్గ తత్కార్య భేదాం శ్చాహ-

ప్రకృతిం త్రిగుణాత్మికాం మాయాం। పురుషం చైవ=జ్ఞాతారం చైవ। ఏతా వుభావపి। అనాదీ విద్ధి - ఇతరేతరయోగపర శ్చకారః,పరస్పరం సంసృష్టతయైవానాదీ జానీహి। వికారాన్- =బంధహేతూ నిచ్ఛా ద్వేష సుఖ దుఃఖాత్మకాన్ దోషాన్। గుణాన్-ముక్తి హేతూ నమానిత్వాదీంశ్చ। ప్రకృతిసంభవాన్। విద్ధి। పురుషేణానాదికాల సంసృష్టాఽనాదిక్షేత్ర ప్రవాహరూపేణ పరి

ణతా ప్రకృతి రేవ పురుషస్య బంధార్థ మిచ్ఛాద్వేష సుఖ దుఃఖాత్మకాన్ వికారా నపవర్గార్థ మమానిత్వాదీన్ (గుణాంశ్చ) కల్పయతీ త్యర్థః ॥19॥

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరు చ్యతే।
పురుష స్సుఖదుఃఖానాం; భోక్తృత్వే హేతురుచ్యతే॥ 20

అర్థ-: ప్రకృతిః=(పురుషాధిష్ఠితమైన) ప్రకృతి. కార్యకారణ కర్తృత్వే= (తన కార్యమైన) శరీరము ఇంద్రియములు తమ తమ విధులను నిర్వర్తించుటలో; హేతుః=హేతువుగ, ఉచ్యతే=చెప్పబడుచున్నది. పురుషః=ప్రకృతిని అధిష్ఠించిన పురుషుడు; సుఖదుఃఖానాం=సుఖదుఃఖములను; భోక్తృత్వే=అనుభవించుటలో; హేతుః=హేతువుగ, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా-: జీవాధిష్ఠితమైన ప్రకృతి శరీరముగ పరిణమించి శరీరము ఇంద్రియములు వాని పనులను నిర్వర్తించుటకు కారణ మగుచున్నది. ఇట్లే ప్రకృతిని అధిష్ఠించిన జీవుడు సుఖదుఃఖానుభోక్త అగుచున్నాడు.

దీపికా-: నను జడాయాః ప్రకృతేః కథ మేవం శక్తి రిత్యత అహ-

ప్రకృతిః=గుణత్రయమయీ మాయా। కార్యకారణకర్తృత్వే-కార్యం= శరీరం, కారణాని=మనః ప్రభృత్యేకాదశేంద్రియాణి, తేషాం, కర్తృత్వే। హేతుః=ఆశ్రయతయా ప్రయోజక భూతః। ఉచ్యతే=ప్రతిపాద్యతే। శరీరేంద్రియరూపేణ పరిణతా భోక్తృపురుషాధిష్ఠితా ప్రకృతిరేవ భోగసాధన శరీరేంద్రియ వ్యాపారాశయభూతేత్యర్థః. ననుప్రకృతేరేవ భోగసాధన క్రియాశ్రయత్వే భోక్తృత్వ మపి తస్యా ఏవస్యా దిత్యత్రాహ (పురుషఇతి) పురుషః=ప్రకృత్యధిష్ఠాతా చేతనః। సుఖదుఃఖానాం=శరీరేంద్రియ జన్యానామిత్యర్థః।భోక్తృత్వే=తదనురూపే భోగే। హేతుః=ఆశ్రయః। ఉచ్యతే। పరస్పర సంసృష్టయోః ప్రకృతి పురుషయో ర్మధ్యే జడాయాః ప్రకృతేః భోగసాధన క్రియా ప్రయోజకత్వం తదధిష్ఠాతు శ్చేతనస్య - శాస్త్రఫలం ప్రయోక్తరీతి న్యాయేన క్రియాఫలభోక్తృత్వం చేత్యర్థః।అనేన క్షేత్ర క్షేత్రజ్ఞయోః కార్య భేదశ్చోక్త ఇతి వేదితవ్యమ్ ॥20॥

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి; భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసంగోఽస్య; సదసద్యోని జన్మసు ॥ 21

అర్థ-: పురుషం=జీవుడు; ప్రకృతిస్థః=ప్రకృతి (శరీరము)తో గూడినవాడై; ప్రకృతిజాన్=ప్రకృతి సంబంధమువలన నేర్పడిన; గుణాన్=సత్త్వాది గుణజన్యములైన సుఖదుఃఖాదులను; భుంక్తే హి=అనుభవించుచున్నాడు గదా. అస్య=ఈ జీవునికి; సత్+అసత్ యోని జన్మసు=మంచి లేక చెడు జాతులలో జన్మించుటయందు, కారణం=కారణము; గుణసంగః=సత్త్వాది గుణముల కార్యములైన సుఖదుఃఖాదులయందు ఆసక్తియే.

తా-: జీవుడు ప్రకృతికార్యమైన శరీరమున జేరి ప్రకృతి గుణములైన సత్త్వాదుల వలన కలుగు సుఖదుఃఖాదుల ననుభవించుటకొఱకు తత్సాధనములైన పుణ్యపాపరూప కర్మల నాచరించుచున్నాడు. పిదప అట్టి కర్మల ఫలము ననుభవించుటకై మంచి లేక చెడు జాతులయందు జన్మించుచున్నాడు. కావున జీవుల జన్మపరంపరకు కారణము సత్త్వరజస్తమోగుణముల సంబంధమే అగుచున్నది.

దీపికా-: నను పరిశుద్ధస్య స్వానుభవైక సుఖస్య వైషయిక సుఖదుఃఖానుభవో న తాత్త్వికః స్యాత్-స్ఫటికస్య జపాకుసుమ లౌహిత్యవ దారోపిత ఏవ చ స్యా దిత్యత్రాహ-

పురుషః=స్వానుభవైక సుఖోపి ప్రత్యగాత్మా। ప్రకృతిస్థః=శరీర సంసృష్టస్సన్। ప్రకృతిజాన్=తత్సంసర్గ ప్రయుక్తాన్। గుణాన్=సత్త్వాది గుణకార్య సుఖదుఃఖాదీన్। భుంక్తే=అనుభవతి హి। అనేన స్వానుభవైక సుఖస్యాపి ప్రకృతి సంబంధఏవ బాహ్య సుఖదుఃఖానుభవే జలౌష్ణ్యానుభవే వహ్ని సంసర్గ ఇవ హేతు రిత్యుక్తం భవతి। నను శుద్ధస్య తస్య ప్రకృతిసంబంధ ఏవ కథ మిత్యత్రాహ (కారణమితి) అస్య=పరిశుద్ధ స్యాప్యాత్మనః। సదసద్యోని జన్మసు - సదసత్సు=సాధ్వసాధుషుయోనిషు=బ్రహ్మక్షత్ర చండాలాది రూపేషు యోనిషు, జన్మాని=శరీరసంబంధరూపాణి, తేషు। గుణసంగః=సత్త్వాది

కార్య సుఖాద్యాసక్తిః కారణం। అయం భావః;దేవ మనుష్యాది పూర్వపూర్వ శరీర సంసృష్టో జీవ స్తత్తత్సంయుక్త సుఖాదీ ననుభూయ తద్వాసనావశా త్పునఃపునః పుణ్యపాపాది కర్మాచరతి-తదనుభవార్థే పునః పున స్సదసద్యో నిషు జాయతే-పునః పున స్సుఖాద్యనుభవతీతి బీజాంకురవ దనాది రియం గుణసంగస్య ప్రకృతి సంబంధ హేతుత్వోక్త్యైవ కదాచి దసంగ కర్మానుష్ఠా నాదికృత సుకృత సంగమం స్యామానిత్వాది గుణ సంపత్తౌ సత్యాం గుణ సంగ నివృత్త్యా ప్రకృతి సంబంధ నివృత్తి రపి సంభవతీ త్యపవర్గార్థ వ్యాపారోఽపి ప్రకృతికార్యం సంభవతీతి ద్యోతితమ్. ॥21॥

శ్లో॥ ఉపద్రష్టాఽనుమన్తా చ; భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుష పరః॥ 22

అర్థ-: పరః=శ్రేష్ఠుడైన; పురుషః=జీవాత్మ; అస్మిన్=ఈ; దేహే=దేహమునందు. ఉపద్రష్టా=దర్శించువాడు (సంకల్పించువాడు) అనుమంతా=అనుమతించువాడు (నియామకుడు) భర్తా= (శరీరమును) ధరించువాడు. భోక్తా= (ఈ శరీరమువలనకలుగు సుఖదుఃఖములను) అనుభవించువాడు. మహేశ్వరః+చ= (శరరేంద్రియములకు) అధిష్ఠాత;పరమాత్మా+ఇతిచ= 'పరమాత్మ' అనియు; ఉక్తః=చెప్పబడినాడు-

తా-: జీవాత్మ శరీరమును అధిష్ఠించి దాని ప్రవృత్తికి అనుకూలముగ సంకల్పించును. దాని ప్రవృత్తులకు సమ్మతించును - కావున ఇతడు శరీరమునకు నియామకుడు. ఈ శరీరమును ధరించువాడు.దీనివలన గలుగు సుఖదుఃఖాదులను అనుభవించువాడును జీవుడే. కావున ఈ శరీరేంద్రియములకు ఇతడు మహేశ్వరుడు పరమాత్మయు నగుచున్నాడు.

దీపికా-: సదసద్యోని జన్మాంతర భావి పురుషస్వభావా నాహ-

అస్మిన్ దేహే=కార్యకారణ సంఘాతే। స్థితః। అపరిచ్ఛిన్న జ్ఞానశక్తి రపి పురుషః। ఉపద్రష్టా-ఉప=మీపే, ద్రష్టా=శరీరసంసృష్టత్వా జ్జీవస్యాపి శరీరస్య ప్రవృత్త్యనుకూల సంకల్పరూప దర్శనవాన్। అనుమంతా=ప్రేర

కః, నియంతేత్యర్థః। భర్తా=దేహస్యాపి ధారకః। భోక్తా=శరీరవ్యాపారఫల భాక్। అనేన శరీరస్య పురుషవిశేషణత్వ ముక్తం। ఏభిర్విశేషణై ర్నియమ నధారణశేషిత్వాదిభి శ్శరీరం ప్రతి పురుషస్య పరత్వ ముక్తం। అతఏవ, మహేశ్వరశ్చ=శరీరేంద్రియమనసా మధిష్ఠాతా చ। పరమాత్మేతి చాపి ఉక్తః - ఏతద్దేహేంద్రియ మనాంసి ప్రతి పరమాత్మేత్యప్యుక్తః। 'అపి' శబ్దా న్మహేశ్వర ఇత్యప్యుక్త ఇతి గమ్యతే। దేహే మనసి చాత్మశబ్దప్రయోగా జ్జీవోఽపి తదపేక్షయా పరమాత్మా భవతి। స్వతోఽపరిచ్ఛిన్నజ్ఞాన శక్తి రప్య యం పురుషోఽనాది ప్రకృతి సంసర్గ గుణసంగాభ్యాం దేహమాత్ర మహే శ్వరో దేహమాత్ర పరమాత్మా చ భ్భవతీత్యర్థః ॥22॥

శ్లో॥ య ఏనం వేత్తి పురుషం, ప్రకృతిం చ గుణైస్సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ 23

అర్థ-: యః=ఎవడు; ఏనం=ఈ; పురుషం=జీవుని, ప్రకృతిం చ=ప్రకృతిని; గుణైః+సహ=సత్త్వాదిగుణములతో సహ. వేత్తి=తెలిసికొనుచున్నాడో; సః=అట్టివాడు, సర్వథా=అన్నివిధములు; వర్తమానః+అపి=ఉన్నవాడైనను; భూయః=మరల; న+అభిజాయతే=జన్మింపడు-

తా-: ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపస్వభావములను చక్కగా తెలిసినవాడు దేవమనుష్యాది నానావిధదేహసంబంధము గలవాడైనను జ్ఞానాగ్ని దగ్ధకర్ముడగుటచేత శరీరావసానమున పరిశుద్ధాత్మస్వరూపమును పొందుచున్నాడు-

దీపికా-: అథ వివేకానుసంధాన ప్రకారం వక్ష్యన్ తత్రాత్యాదరాయ తత్ఫలం ప్రథమం దర్శయతి-

యః=పుమాన్। ఏవం=ఉక్తస్వభావం పురుషం ప్రకృతిం చ। గుణైః=వక్ష్యమాణస్వభావైః సత్త్వాదిభిః। వేత్తి=యథావద్వివేకేన జానాతి। సః=పుమాన్।సర్వథా=దేవమనుష్యాది నానావిధ దేహసంసర్గప్రయుక్త యోగవిరోధి విచిత్రక్లేశావిష్టతయా వర్తమానోఽపి। భూయః। పునరపి। నాభిజా

యతే=సదసద్యోని సంబంధం న ప్రాప్నోతి, కింతు జ్ఞానాగ్నిదగ్ధకర్మత్వా త్తద్దేహావసాన ఏవాఽపరిచ్ఛిన్నజ్ఞానం పరిశుద్ధాత్మానం ప్రాప్నోతీత్యర్థః॥ 23

శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాఽపరే॥ 24

అర్థ-: కేచిత్=కొందరు. ధ్యానేన=ధ్యానయోగముచేత. ఆత్మని=శరీరమునందు; (స్థితం = ఉన్న )ఆత్మానం=జీవునిఆత్మనా=మనస్సుతో; పశ్యంతి=చూచుచున్నారు. అన్యే= (యోగమున పరిణతి జెందని కొందరు. సాంఖ్యేన యోగేన=జ్ఞానయోగముచేతను; అపరే= (జ్ఞానయోగమున అధికరింప లేని) కొందరు; కర్మయోగముచేతను; పశ్యన్తి=(పరిశుద్ధాత్మస్వరూపమును) దర్శించుచున్నారు.

తా-: యోగపరిపాకము నందినవారు శరీరము నందున్న ఆత్మను మనస్సుతో ధ్యానయోగముచే దర్శించుచున్నారు. యోగపరిపాకమునందని వారు జ్ఞానయోగముచే మనస్సును సమాధికి అనుకూలముగ చేసికొని దర్శించుచున్నారు. జ్ఞానయోగమునను ష్ఠింపలేనివారు కర్మయోగముద్వారా మనస్సును సమాధియోగ్యముగ నొనర్చుకొని దానిద్వారా ఆత్మతత్త్వమును దర్శించుచున్నారు-

దీపికా-: ఉక్త మేవార్థం శ్లోకద్వయేన వివృణ్వ న్నాత్మజ్ఞానస్య పర్వభేదానాహ-

కేచిత్=నిష్పన్నయోగాః- పుమాంసః। ఆత్మని=శరీరే। స్థితం। ఆత్మానం=పరిశుద్ధాత్మానం। ఆత్మనా=మనసా కరణేన। ధ్యానేన=సమాధినా। పశ్యంతి=విశద మనుభవంతి। అన్యే=అనిష్పన్నయోగాః। సాంఖ్యేన-సంఖ్యా=జ్ఞానం, సంఖ్యైవ సాంఖ్యం-తేన యోగేన। ఆత్మానం పశ్యంతి।జ్ఞానయోగేన సమాధియోగ్యం మనః కృత్వా పరిశుద్ధాత్మానం సాక్షాత్కుర్వంతీత్యర్థః। అపరేచ=కర్మయోగాధికారిణస్తు। కర్మయోగేన=అసంగకర్మానుష్ఠానేన। ఆత్మానం పశ్యంతీత్యన్వయః। దుష్కర జ్ఞానయోగాధికారిణ స్సుకరోపాయసక్తాశ్శిష్టా ఏవాంతర్గతజ్ఞానేన కర్మయోగేన మనస స్సమాధియోగ్యతా మాపాద్యాత్మానం పశ్యంతీత్యర్థః ॥24॥

శ్లో॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాఽపి తరన్త్యేవ; మృత్యుం శ్రుతిపరాయణాః॥ 25

అర్థ-: అన్యే తు మరికొందరు; ఏవం=ఇట్లు; అజానన్తః=కర్మయోగము చేత సైతము) ఎఱుగలేనివారు. అన్యేభ్యః=ఇతరుల (జ్ఞానుల) వలన; శ్రుత్వా=విని; ఉపాసతే=ఆత్మోపాసనము గావించుచున్నారు. తే+అపి= అట్టివారును; శ్రుతిపరాయణాః+చ=శ్రవణమాత్ర నిష్ఠితులును; మృత్యుం = సంసారమును; తరంతి+ఏవ=తప్పక దాటుదురు.

తా-: కర్మయోగమునందును అధికరింపనివారు జ్ఞానులవలన ఆత్మ తత్త్వమునుగూర్చి విని ఉపాసించుచున్నారు. ఇట్టి వీరును కేవలశ్రవణ మాత్రనిష్ఠులును క్రమముగ ఆత్మదర్శనము నందగలరు.

దీపికా-: అనిష్పన్న కర్మయోగానాం ముముక్షూణాం కర్మయోగో పక్రమ దర్శ్యతే-

అన్యే తు=కర్మయోగాది ష్వప్యనధికృతాః। ఏవం=పూర్వోక్తరీత్యా। అజానంతః=ఆత్మానం సాక్షాత్కర్తు మశక్తాశ్శిష్టాః। అన్యేభ్యః=ఆత్మతత్త్వ దర్శిభ్యః। శ్రుత్వా=ఆత్మశ్రవణం కృత్వా। ఉపాసతే=ఆత్మానం ధ్యాయన్తి తేపి చ, అత్ర 'అపి, చ' శబ్దాభ్యా మేషాం నికృష్టత్వ మన్యేషాం శ్రైష్ఠ్యం చ సూచ్యతే. శ్రుతిపరాయణాః = శ్రవణమాత్రనిష్ఠా స్సంతః। మృత్యుం=సంసారం। అతితరంత్యేవ=అతీత్య వర్తంత ఏవ। శ్రవణనిష్ఠా విధ్వస్తపాపాః క్రమేణ కర్మయోగ జ్ఞానయోగద్వారా సమాధి యోగ్యతా మాసాద్య ముచ్యంత ఏవేతి భావః ॥25॥

శ్లో॥ యావ త్సఞ్జాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ॥ 26

అర్థ-: భరత+ఋషభ=అర్జున; స్థావరజంగమం=స్థిరచరాత్మకమైన; సత్త్వం=ప్రాణి (సముదాయము) కించిత్=ఏదిగాని; యావత్=ఎంత(వరకు)

సంజాయతే=జన్మించుచున్నదో; (తావత్=అది యంతయు) క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్=క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క కలయిక వలన (అని) విద్ధి=తెలిసికొనుము.

తా:- అర్జున; ఈ స్థిరచరాత్మకమైన ప్రపంచ మంతయు జీవ ప్రకృతుల సంయోగమువలన జనించుచున్నదని తెలిసికొనుము-ఈ జీవ ప్రకృతుల సంయోగము అనాదియైనది.

దీపికా-: అథ ప్రకృతి సంసృష్టాత్మనో వివేకాను సంధాన ప్రకారం వక్తుం స్థావర జంగమాత్మకస్య ప్రపంచస్య చిదచిత్సంసర్గ జన్యత్వమాహ-

హే భరతర్షభ। యావత్। కించిత్=కించిదపి। స్థావర జంగమం। సత్త్వం=జంతుజాతం। సంజాయతే। తత్=సర్వం। క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాదేవ విద్ధి - అనాది పరస్పర సంయుక్త క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగజం విద్ధి-నతు మాతా పిత్రాది సంసర్గాదేవ; కదాచిత్సంసర్గాదేవ వా జాయత ఇత్యర్థః॥ అతోదుర్వివేచతయా పరస్పర వివేకానుసంధాన ముపదేష్టవ్య మితిభావః ॥26

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ 27

అర్థ-: సర్వేషు భూతేషు=సమస్త ప్రాణులయందును; తిష్ఠంతం=ఉన్నవానిగను; సమం=సమానునిగను; పరమేశ్వరం=నియామకునిగను; వినశ్యత్సు=(దేహాదులు) నశించుచున్నను, అవినశ్యన్తం=నశింపనివానిగను; యః=ఎవడు; పశ్యతి=(ఆత్మతత్త్వమును) తెలిసికొనుచున్నాడో; సః=అట్టివాడు పశ్యతి=(వాస్తవమైన ఆత్మస్వరూపమును) తెలిసికొనుచున్నాడు.

తా-: ఆత్మ జ్ఞానైకాకారుడు. దేవమనుష్యాది శరీరముల నధిష్ఠించి వానిని నియమించువాడు. ఆ శరీరాదులకంటెను విలక్షణమైనవాడు. శరీరాదులు నశించినను నశింపనివాడు; ఆత్మయొక్క ఇట్టి వాస్తవస్వరూపమును తెలిసినవాడే ఆత్మసాక్షాత్కారము నందగలడు.

దీపికా-: సర్వేషు భూతేషు=దేవమనుష్యాది రూపేషు। తిష్ఠంతం=మృత్సువర్ణాది ఘటేషు గంగాజలమివ తత్తద్వివిక్తాకారతయా స్థితం; నతు రుమానిక్షిప్త కాష్ఠవ త్తద్రూపతా మాపన్నం। అతఏవ। సమం=జ్ఞాతృత్వై కాకారతయైకరూపం। అతఏవ, పరమేశ్వరం=తత్తచ్ఛరీరాధిష్ఠాతృతయాఽత్యంత తద్వివిక్తాకారమ్. వినశ్యత్సు=వినాశం ప్రాప్నువత్సు సత్సు। అవినశ్యంతం=వినాశానర్హ స్వభావతయా నాశరహితం। యః పశ్యతి=అనుసందధాతి। సః పశ్యతి=యథావత్సాక్షాత్కరోతి। యస్తు మనుష్యాది దేహవైషమ్యేనాత్మాన మపి విషమాకారం జన్మనాశవంతం చాఽనుసందధాతి సతు నిత్యం సంసరతీతి భావః ॥27॥

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర; సమవస్థిత మీశ్వరమ్।
న హిన స్త్యాత్మనాఽఽత్మానం; తతో యాతి పరాం గతిమ్ ॥ 28

అర్థ-: సర్వత్ర=అన్ని దేహములయందును; సమవస్థితం=ఉన్నట్టి; ఈశ్వరం=నియామకుడైన ఆత్మను; సమం=సమానాకారునిగా; పశ్యన్=తెలిసికొనువాడు; ఆత్మనా=మనస్సుచేత; ఆత్మానం=ఆత్మను; న హినస్తి=హింసింపడు; తతః = అందువలన; పరాం=ఉత్తమమైన; గతిం=ఆత్మస్వరూపమును; (గమ్యతే=ప్రాప్యతే ఇతి=గతిః) యాతి=పొందుచున్నాడు.

తా-: ఆత్మ శరీరమునకు శేషి. ఆధారము. నియామకుడు. కావుననే దానికి ఈశ్వరుడు. జ్ఞానైకాకారుడైన ఇట్టి ఆత్మను చక్కగా తెలిసినవాడు మనస్సుచే వానిని సంసారబంధ విముక్తునిగ జేయును.

దీపికా:- ఉక్త సమదర్శన మేవ ఫలద్వారా స్తూయతే-

హి =యస్మాత్కారణాత్। సర్వత్ర=దేవమనుష్యాది దేహేషు। సమస్థితం=సమ్యగవస్థితం। శేషత్వేనాధారతయా నియంతృతయా చాఽవస్థితం। ఈశ్వరం=జీవం। సమం=జ్ఞాతృత్వైకాకారతయా ఏకరూపం। పశ్యన్। ఆత్మనా=మనసా। ఆత్మానం=స్వాత్మానం। న హినస్తి=సంసారార్ణవే నిక్షిప్య న నిహంతి, కింతు సంసారసాగరా దుత్తార్యోజ్జీవయతీత్యర్థః। తదేవాహ (తత ఇతి) తతః=జ్ఞాతృత్వైకాకారతయా సర్వత్ర సమత్వదర్శనాత్। పరాం=

ఉత్కృష్టాం। గతిం=గమ్యత ఇతి గతిః ప్రాప్యం, తాం=పరిశుద్ధ స్వరూప మాత్మానం। యాతి=ప్రాప్నోతి। అనేన స్వస్వాకార యథావ ద్దర్శన ద్వారా బంధహేతుత్వ మోక్షహేతుత్వాభ్యాం వివేక ఉక్తో భవతి ॥28॥

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి; క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥ 29

అర్థ-: కర్మాణి=కర్మలను; సర్వశః=అన్ని విధముల; ప్రకృత్యా+ఏవ= ప్రకృతిచేతనే; క్రియమాణాని=చేయబడుచున్నవానినిగను; తథా= అట్లే; ఆత్మానం= ఆత్మను; అకర్తారం చ=కర్తకానివానినిగను: యః=ఎవడు; పశ్యతి=తెలిసికొనుచున్నాడో; సః=అట్టివాడు; పశ్యతి=(వాస్తవమైన ఆత్మ స్వరూపమును తెలిసికొనుచున్నాడు.

తా-: దేహేంద్రియాదిరూపమున పరిణమించిన ప్రకృతియే కర్మలను గావించుచున్నది. ఆత్మ జ్ఞానైకాకారుడు ఉదాసీనుడు అగుటచేత కర్త కాజాలడు. ఈ విషయమును తెలిసినవాడే ఆత్మస్వరూపవేత్త. దేహాత్మభ్రాంతి కలవాడు ఆత్మనే కర్తగా భావించును. ఇది యథార్థము కాదు.

దీపికా-: అథైతయో స్సాక్షాత్క్రియాశ్రయత్వ తదభావాభ్యాం వివేక మాహ-

యః=యోగీ। సర్వశః కర్మాణి=సర్వప్రకారాణి కర్మాణి ప్రకృత్యైవ చ క్రియమాణానీతి పశ్యతి 'కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ఇతి పూర్వోక్తరీత్యా ప్రకృతిక్రియమాణతయాఽనుసంధత్తే। తథా ఆత్మానం। అకర్తారం=జ్ఞానైకాకారతయా ఉదాసీనం। యః పశ్యతి। తస్య ప్రకృతి సంసర్గ తదధిష్ఠాన సుఖాద్యనుభవాదికం చ కర్మరూపావిద్యాకృత మిత్యపి పశ్యతీతి బోధ్యం। సః। పశ్యతి=యథావస్థిత మాత్మానం జానాతీత్యర్థః ॥29॥

శ్లో॥ యథా భూతపృథగ్భావ; మేకస్థ మనుపశ్యతి।
తత ఏవ చ; విస్తారం; బ్రహ్మ సమ్పద్యతే తదా ॥ 30

అర్థ-: యదా=ఎపుడు; భూత పృథగ్భావం=దేవమనుష్యాది రూపము లైన ప్రాణులయందు జాతిగుణరూపాది భేదమును; ఏకస్థం=ప్రకృతి మాత్రనిష్ఠముగను; తతః+ఏవ=ఆ ప్రకృతివలననే; విస్తారం చ=పుత్ర పౌత్రాది విస్తృతిని; అనుపశ్యతి=తెలిసికొనునో; తదా=అపుడు; బ్రహ్మ= శుద్ధాత్మ స్వరూపమును; సంపద్యతే=పొందుచున్నాడు.

తా-: ప్రాణిసముదాయము ప్రకృతిపురుషుల కలయికచే ఏర్పడుచు న్నది. ఇట్టి ప్రాణులయందు చూపట్టు దేవత్వ మనుష్యత్వాది జాతిభేదములు; స్థూలత్వ కృశత్వాది గుణభేదములు ప్రకృతిమాత్రనిష్ఠములు. ఆత్మనిష్ఠ ములు కావు. ఇట్లే పుత్రపౌత్రాదిరూప వంశాభివృద్ధియు ప్రకృతి కార్యమే. ఈ తత్త్వమును తెలిసినవాడు పరిశుద్ధమైన ఆత్మతత్త్వమును పొందుచు న్నాడు.

దీపికా-: అద్వైతయోః పరిణామిత్వాఽపరిణామిత్వాభ్యాం వివేకం దర్శయతి -

యదా=యస్మిన్కాలే। భూత పృథగ్భావం=భూతేషు-తిలతైలవ ద్దారు వహ్నివ ద్దుర్వివేచ ప్రకృతి పురుషద్వయాత్మకేషు దేవమనుష్యాదిషు, పృథగ్భావం=దేవోఽహ మ్మనుష్యోఽహం స్థూలోఽహం కృశోఽహ మిత్యా ద్యనుభూయమానం జాతిగుణాదిరూపం భేదం। ఏకస్థం=ప్రకృతిమాత్ర నిష్ఠం, న త్వాత్మనిష్ఠం। తత ఏవ చ=ప్రకృతిత ఏవ చ। విస్తారం=పుత్ర పౌత్రాది వృద్ధిం చ పశ్యతి। యద్యపి="ఆత్మా వై పుత్రనామాసి" త్యా త్మన ఏవ పుత్రాది రూపేణ పరిణామః శ్రూయతే, తథాపి "అంగాదంగాత్సం భవతీ''తి మంత్రలింగా త్పిత్రాదిశరీరా త్పుత్రాది శరీరోత్పత్తి ర్నిర్ణీయత ఇతి భావః। తదా=తస్మిన్కాలే। బ్రహ్మ=అపరిచ్ఛిన్న జ్ఞానరూప మాత్మా నం। సంపద్యతే=ప్రాప్నోతి। మత్సమానాకారో భవతీత్యర్థః ॥30॥

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా; త్పరమాత్మాఽయ మవ్యయః।
శరీరస్థోఽపి కౌన్తేయ; న కరోతి న లిప్యతే ॥ 31

అర్థ-: కౌంతేయ=అర్జున; అయం=ఈ; పరమాత్మా=పరమాత్మ; శరీరస్థః + అపి=శరీరమునందున్నను; అనాదిత్వాత్=ఉత్పత్తి లేనివాడగుటవలన; అవ్యయః=నాశరహితుడు-నిర్గుణత్వాత్=సత్త్వాదిగుణరహితుడగుటవలన; న కరోతి=కర్మలను చేయడు; న లిప్యతే=(దేవాది దేహస్వభావములచే) అంటబడడు.

తా-: దేహాది విలక్షణుడై ఆ దేహాదులకు శేషి ఆధారము నియామకుడు అగుటచే పరమాత్మ అనబడు ఈ జీవాత్మ దేహములయందున్నను ఆ దేహాదులవలె ఉత్పత్తి వినాశములు కలిగియుండడు. నిత్యుడుగదా. సత్త్వాది గుణ రహితుడగుటవలన కర్తయు కాడు. కర్మవాసనలును అతనికి అంటవు.

దీపికా-: పూర్వోక్తే ష్వాత్మనో నిత్యత్వాఽకర్తృత్వాఽపరిణామిత్వేషు హేతు మాహ-

అయం। పరమాత్మా=శరీరాన్నిష్కృష్య స్వస్వభావేన నిరూపితః ప్రత్యగాత్మా। శరీరస్థోపి। అనాదిత్వాత్-ఆరంభక ద్రవ్య శూన్యత్వాత్। అవ్యయః=నాశరహితః। ఆరభ్యమాణ మేవ హి నశ్యతి, ఆత్మా త్వనారభ్యమాణత్వా న్న నశ్యతీతి భావః। నిర్గుణత్వాత్-సత్త్వాదిగుణ రహితత్వాత్। న కరోతి=కర్తా న భవతి। తస్మాత్। న లిప్యతే=దేవాది దేహ స్వభావైః, లిప్తః=వాసితో న భవతి ॥31॥

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే।
సర్వత్రాఽవస్థితో దేహే; తథాఽఽత్మా నోపలిప్యతే॥ 32

అర్థ-: ఆకాశం=ఆకాశము; సర్వగతం + అపి=అంతట వ్యాపించియున్నను; సౌక్ష్మ్యాత్=సూక్ష్మమగుటవలన; యథా=ఎట్లు; న + ఉపలిప్యతే=అంటబడదో; తథా=అట్లే; ఆత్మా=జీవాత్మ; దేహే సర్వత్ర=దేహమునందు అంతట; అవస్థితః + అపి=ఉన్నవాడైనను; న + ఉపలిప్యతే=(దేహ స్వభావములచే) అంటబడడు.

తా-: ఆకాశము అంతట వ్యాపించియున్నను అతిసూక్ష్మమైనదగుటవలన ఆయా పదార్థముల స్వరూపస్వభావాదులచే అంటబడదు. ఇట్లే జీవా

త్మయు శరీరమునందు అంతట వ్యాపించియున్నను అతి సూక్ష్మమైనవాడగుటవలన శరీరధర్మములచే అంటబడడు.

దీపికా-: నను నిత్యం కశ్మలశరీరసంయుక్తో వివిక్తాత్మా రమానిక్షిప్త కాష్ఠవ త్సంసర్గ స్వభావై ఃకిమితి న లిప్యతే,కించ"యం ప్రాప్యాఽతి పవిత్రాణి వస్త్రాణ్యాభరణాని చ। అశుచిత్వం క్షణాద్యాంతి కోన్యోఽశుచితమస్తతః" ఇత్యభియుక్తోక్త రీత్యా క్షణమాత్రేణాఽశుచిత్వాపాదకస్య శరీరస్య నిత్యయోగేఽపి కథం న లిప్యతే? తత్రాహ -

సర్వగతం=అనంత విచిత్ర స్వభావ నానావస్తుసంసర్గ మపి। ఆకాశం। సౌక్ష్మ్యత్=సూక్ష్మత్వాత్; (ఆత్మనః) అసంగస్వభావత్వాదితి యావత్। యథా నోపలిప్యతే=తత్స్వభావోపరక్తం న భవతీత్యర్థః। తథా సర్వత్ర। దేహే=దేవమనుష్యాది దేహేషు। అవస్థితోఽపి। ఆత్మా। నోపలిప్యతే - పరిశుద్ధతయా-ఆకాశాదప్యతి సూక్ష్మతయా దేహస్వభావై ర్నోపలిప్యత ఇతి భావః ॥32॥

శ్లో॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ 33

అర్థ-: హే భారత=ఓ అర్జునా; ఏకః=ఒక్కడైన; రవిః=సూర్యుడు; కృత్స్నం=సమగ్రమైన; ఇమం=ఈ; లోకం=లోకమును; యథా=ఎట్లు; ప్రకాశయతి= ప్రకాశింపజేయునో; తథా అట్లే; క్షేత్రీ=జీవాత్మ; కృత్స్నం సమగ్రమైన; క్షేత్రం=శరీరమును; ప్రకాశయతి=ప్రకాశింపజేయుచున్నాడు.

తా-: అర్జున; ఒక్క సూర్యుడు ఈ ప్రపంచము నంతటిని ఎట్లు ప్రకాశవంతము గావించుచున్నాడో; అట్లే జీవాత్మయు ఈ శరీరమున నఖశిఖ పర్యంతము జ్ఞాన ప్రకాశమును కలిగించుచున్నాడు. కావున జీవాత్మ ప్రకృతి విలక్షణుడని తెలిసికొనుము.

దీపికా-: అథాధ్యాయార్థోపవ ర్ణితం క్షేత్రక్షేత్రజ్ఞయో ర్వేద్యత్వ వేదితృత్వాది భేదం సదృష్టాంతం విశదం వద న్నుపసంహరతి -

హే భారత। ఏకః। రవిః। కృత్స్నం విచిత్ర భేదభిన్నం ఇమం లోకం। ప్రకాశయతి=స్వప్రభయా విశదీకరోతి। తథా క్షేత్రీ=క్షేత్రజ్ఞోపి। కృత్స్నం-క్షేత్రం-నానావిధం శరీరం; ప్రకాశయతి = బహిరంతశ్చ స్వజ్ఞానవ్యాప్త్యా విశదీకరోతి। అతః ప్రకాశ్యాల్లోకా త్ప్రకాశయితాఽఽదిత్య ఇవ వేద్యాత్ క్షేత్రాద్వేదితాఽప్యన్య ఇతి భావః ॥33॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ; మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతి మోక్షం చ; యే విదుర్యాన్తి తే పరమ్ ॥ 34

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః

అర్థ : ఏవం=ఇట్లు; క్షేత్రక్షేత్రజ్ఞయోః=ప్రకృతి జీవులయొక్క;అన్తరం=భేదమును; భూతప్రకృతిమోక్షం చ = భూతాకారమున పరిణమించిన ప్రకృతియొక్క మోక్షోపాయమైన అమానిత్వాదికమును; యే=ఎవరు; జ్ఞానచక్షుషా=జ్ఞాననేత్రముతో; విదుః=తెలిసికొనుచున్నారో; తే=అట్టివారు;పరం=ఉత్తమమైన ఆత్మస్వరూపమును; యాన్తి=పొందుచున్నారు.

తా-: ప్రకృతిపురుష వివేకజ్ఞానము గలిగి మోక్షసాధనములైన అమానిత్వాది గుణములను ఎవడు కలిగియుండునో, అతడు పరిశుద్ధాత్మస్వరూపమును పొందగలడు. ఇచట మోక్షశబ్దము మోక్షసాధన వాచకము (మోక్ష్యతే అనేనేతి=మోక్షః)

దీపికా-: అథైతదధ్యాయ ప్రధాన ప్రతిపాద్య హేయోపాదేయ విజ్ఞానస్య ఫల మాహ-

ఏవం=ఉక్త ప్రకారేణ। క్షేత్రక్షేత్రజ్ఞయోః।అంతరం=భేదం।భూతప్రకృతిమోక్షం చ - భూతానాం=అచిత్సంసృష్ట జీవానాం, ప్రకృతిః =ప్రకృతి పరిణామభూతం శరీరం। మోక్ష్యతే=త్యజ్యతే - అనేనేతి=భూత ప్రకృతి మోక్షః- అమానిత్వాది సాధనవర్గ ఇతియావత్, తం। జ్ఞానచక్షుషా - జ్ఞానం

వివేకరూపం, తదేవ - చక్షుః, తేన-యే విదుః యథావ జ్జానంతి। తే।పరం= పరిశుద్ధాత్మానం। యాంతి= ప్రాప్నువంతి। ఉక్తేన క్షేత్రక్షేత్రజ్ఞ వివేకేనాఽ మానిత్వాది సాధన సంపత్త్యా చ విగతబంధాః పరిశుద్ధాత్మానం ప్రాప్నువన్తీత్యర్థః ॥34॥

ఇతి శ్రీ భగవద్గీతా భాష్యార్థసంగ్రహ తాత్పర్యదీపే శ్రీ వరవరముని విరచితాయాం బాలబోధిన్యపరాభిధానాయాం గీతార్థసంగ్రహ దీపికాయాం త్రయోదశోఽధ్యాయః॥

శ్రీరస్తు

గీతార్థ సంగ్రహః

శ్లో॥ దేహస్వరూప మాత్మాప్తి హేతు రాత్మవిశోధనమ్।
బంధహేతు ర్వివేకశ్చ త్రియోదశ ఉదీర్యతే॥

అర్థ-: దేహ స్వరూపం=దేహముయొక్క స్వరూపము ఆత్మ + ఆప్తి హేతుః=ఆత్మ ప్రాప్త్యుపాయము; ఆత్మవిశోధనం=దేహవియుక్తాత్మస్వరూప పరిశీలనము; బంధహేతుః=దేహసంబంధము కలుగుటకు హేతువు;వివేకః + చ=దేహముకంటె ఆత్మను వెరుగ తెలిసికొను విధమున్ను; త్రయోదశే=ఈ పద మూడవ అధ్యాయమున; ఉదీర్యతే=చెప్పబడుచున్నది.

తా-: దేహస్వరూపము ఆత్మప్రాప్త్యుపాయము శుద్ధాత్మస్వరూపవివేచనము; పరిశుద్ధాత్మకు దేహసంబంధము కలుగుటకుగల హేతువు దేహముకంటె ఆత్మకుగల విశిష్టతను తెలిసికొను విధమున్ను ఈ పదమూడవ అధ్యాయమున తెలుపబడినవి.



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# భగవద్గీతామృతము

## చతుర్దశాఽధ్యాయము – గుణత్రయవిభాగయోగము.

శ్రీ భగవానువాచ:

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి; జ్ఞానానాం జ్ఞాన ముత్తమం।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే; పరాం సిద్ధిమితో గతాః 1

అర్థ-: పరం=పూర్వము చెప్పబడినదానికంటె భిన్నమైనదియు; జ్ఞానానాం=ప్రకృతిపురుషవిషయక జ్ఞానములలో; ఉత్తమం=శ్రేష్ఠమైనదియు నైన; జ్ఞానం= (సత్త్వాదిగుణవిషయక) జ్ఞానమును; భూయః=మరల (విస్తారముగ) ప్రవక్ష్యామి=చెప్పబోవుచున్నాను. యత్=దేనిని; జ్ఞాత్వా=తెలిసికొని; సర్వే మునయః=మునులు అందరు; ఇతః=ఈ సాంసారికదశకంటె; పరాం=ఉత్కృష్టమైన; సిద్ధిం= (శుద్ధాత్మస్వరూప) ప్రాప్తిని; గతాః=పొందిరో.

తా-: అర్జున; ప్రకృతిపురుషులనుగూర్చి చెప్పు సందర్భమున ప్రస్తుతములైన సత్త్వాదిగుణములనుగూర్చి విశదముగ తెల్పెదను-ఇది ఉత్తమమైనది. దీనిని చక్కగా తెలిసికొనిన ఆత్మమననశీలురు సాంసారికదశను దాటి పరిశుద్ధాత్మస్వరూపమును పొందినారు.

దీపికా-: పూర్వం త్రయోదశాధ్యాయే తిలతైలవత్పరస్పరం సంసృష్టయోః ప్రకృతిపురుషయో స్స్వరూపయాథాత్మ్యం విజ్ఞాయ భగవద్భక్త్యను గృహీతాఽమానిత్వాది సాధనవర్గేణ బంధాన్ముచ్యతే, పూర్వపూర్వ సత్త్వాది గుణకార్య సుఖాదిసంగేన న బధ్యతే ఇతి చోక్తం। ఇదానీం చతుర్దశాధ్యాయే గుణానాం బంధహేతుత్వప్రకారం గుణనివర్తనప్రకారం చ ప్రపంచయిష్యన్ భగవానువాచ।

పరం=పూర్వోక్తా దన్యత్। జ్ఞానానాం=ప్రకృతి విషయాణా మేవ జ్ఞానానాం మధ్యే। ఉత్తమం=శ్రేష్ఠం। జ్ఞానం=ప్రకృతిగుణ సత్త్వాదివిషయమేవ జ్ఞానం। భూయః=పునరపి। ప్రవక్ష్యామి=ప్రకర్షేణ కథయిష్యామి। యత్=జ్ఞానం। జ్ఞాత్వా=సవిశేషం విజ్ఞాయ। మునయః=తన్మననశీలాః। సర్వే=జ్ఞానినః। ఇతః=అస్మాత్సంసారమండలాత్। పరాం=ఉత్తమాం। సిద్ధిం=పరిశుద్ధాత్మ ప్రాప్తిరూపాం। గతాః=ప్రాప్తాః ॥1॥

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య; మమ సాధర్మ్య మాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే; ప్రలయే న వ్యథన్తి చ॥ 2

అర్థ-: ఇదం=ఈ;జ్ఞానం=జ్ఞానమును; ఉప+ఆశ్రిత్య=ఆశ్రయించి; మమ=నాయొక్క; సాధర్మ్యం=సామ్యమును; ఆగతాః=పొందినవారు; సర్గే+అపి=సృష్టికాలమునను; న+ఉపజాయన్తే=జనింపరు. ప్రళయే చ=ప్రళయమునందును; నవ్యథన్తి=దుఃఖింపరు.

తా-: ఈ సత్త్వాదులను చక్కగ తెలిసినవారు నాతో సామ్యమును పొందుదురు. వారికి జననమరణము లుండవు.

దీపికా-: పునరపి తదేవ జ్ఞానం - విశినష్టి। (ఇదమితి)

ఇదం=వక్ష్యమాణం। జ్ఞానం ఉపాశ్రిత్య సాధనతయాఽవలంబ్య; మమ। సాధర్మ్యం=అకర్మవశ్యత్వాదినా సామ్యం। ఆగతాః పుమాంసః సర్గేపి=సృష్టికాలేఽపి। నోపజాయంతే=బ్రహ్మాదిషూత్పద్యమానేష్వపి నోత్పద్యంత ఇత్యర్థః। ప్రళయేఽపి=బ్రహ్మాదీనాం ప్రళయే। న వ్యథంతి=ప్రళయదుఃఖం నాఽనుభవంతి ॥2॥

శ్లో॥ మమ యోనిర్మహ ద్బ్రహ్మ; తస్మిన్గర్భం దధామ్యహం।
సంభవ స్సర్వభూతానాం; తతో భవతి భారత॥ 3

అర్థ-: హే భారత=ఓ అర్జున; యోనిః=సర్వజగత్కారణము; మహత్=అపరిచ్ఛిన్నము అయిన; బ్రహ్మ=ప్రకృతి; మమ=నాది. తస్మిన్=ఆ ప్రకృ

తియందు; గర్భం=(జీవసముదాయ రూపమైన) బీజమును;దధామి=ఉంచు చున్నాను. తతః=ఆ ప్రకృతిజీవుల సంయోగమువలన; సర్వభూతానాం= సకలప్రాణులయొక్క; సంభవః=ఉత్పత్తి; భవతి=కలుగుచున్నది.

తా-: సర్వజగత్కారణము అపరిచ్ఛిన్నము అయిన ఈ అచేతనప్రకృతి నాకు సంబంధించినది. దీనియందు నేను జీవసముదాయమును ప్రవేశింపజేయుటచే బ్రహ్మాదిస్తంబపర్యంతమైన సృష్టి జరుగుచున్నది. (ఇచటి 'బ్రహ్మ'శబ్దము ప్రకృతి వాచకము)

దీపికా-: అథ సత్త్వాదీనాం బంధహేతుత్వం వక్తుం కృత్స్నస్య స్థావర జంగమాత్మకస్య ప్రపంచస్య ప్రకృతి సంసర్గ జన్యత్వం స్వేనైవ కృత మిత్యాహ।

హే భారత; యోనిః- 'భూమిరాప' ఇత్యాదినా 'అపరేయమితస్త్వన్యా' మిత్యంతేనోక్తం జగత్ప్రకృతిభూతం। మహత్=అపరిచ్ఛిన్నం। బ్రహ్మ= మహదాదికార్య బృంహణం, తత్రాప్రాదుర్భావకారణం। మమ=మత్సంబంధి, మచ్ఛేషభూతమిత్యర్థః। తస్మిన్=భోగక్షేత్రే ప్రధానే అహం। గర్భం=బ్రహ్మాదిప్రాణివర్గ బీజభూతం భోక్తృపుంజరూపం గర్భం।దధామి=నిక్షిపామి, భోగక్షేత్రభూతయాఽచేతనప్రకృత్యా సహ భోక్తృపుంజరూపాం చేతనప్రకృతిం సంయోజయామీత్యర్థః। తతః=చేతనాఽచేతన సంసర్గాత్। సర్వభూతానాం= బ్రహ్మాదిస్తంబపర్యంతానాం ప్రాణినాం। సంభవః=ఉత్పత్తిః భవతి ॥3॥

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ మూర్తయ స్సమ్భవన్తి యాః
తాసాం బ్రహ్మ మహద్యోని, రహం బీజప్రదః పితా॥ 4

అర్థ-: హే కౌంతేయ=ఓ అర్జున; సర్వయోనిషు=సమస్తజాతులయందును;యాః మూర్తయః=ఏ దేహములు;సంభవన్తి=పుట్టుచున్నవో;తాసాం= వానికి; మహత్ బ్రహ్మ=అపరిచ్ఛిన్నమైన అచేతనప్రకృతి; యోనిః= కారణము(తల్లి)అహం= నేను; బీజప్రదః= బీజము నొసంగు; పితా= తండ్రిని.

తా-: అర్జున; ఈ సమస్తప్రాణులకు అచేతన ప్రకృతి తల్లి కాగా నేను తండ్రిని అగుచున్నాను.

దీపికా-: కారణావస్థ చిదచిత్ప్రకృతిద్వయ సంసర్గస్య స్వకృతత్వ ముక్త్వా కార్యావస్థ చిదచిత్ప్రకృతిద్వయ సంసర్గస్యాపి స్వకృతత్వమాహ।
హే కౌంతేయ। సర్వయోనిషు=దేవయక్ష రాక్షస మనుష్య పశుపక్షి సరీసృపాదియోనిషు;యాః మూర్తయః=కార్యభూతతత్తద్వ్యక్తయః। సంభవంతి=జాయన్తే; తాసాం మూర్తీనాం। మహత్=మహదాదిపృథివ్యంతపరిణతం। బ్రహ్మ=ప్రకృతిః; యోనిః=మాతృస్థానీయకారణం। అహం=సర్వజ్ఞః। బీజప్రదః=తత్తత్కర్మానుగుణ్యేన జనిష్యమాణ భోక్తృవర్గరూప గర్భాధాన హేతుః। పితా=జనకః ॥4॥

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి; గుణాః ప్రకృతిసమ్భవాః।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్॥ 5

అర్థ.: హే మహాబాహో=ఓ అర్జున; ప్రకృతిసంభవాః=ప్రకృతి వలన ఏర్పడుచున్న; సత్త్వం రజః+తమః+ఇతి=సత్త్వము రజస్సు తమస్సు అను; గుణాః=గుణములు; అవ్యయం=నాశరహితుడగు; దేహినం=ఆత్మను; దేహే=దేహమునందు; నిబధ్నన్తి=బంధించుచున్నవి.

తా-: అర్జున; ప్రకృతిసిద్ధములైన సత్త్వరజస్తమో గుణములు అసంకుచితజ్ఞానైకాకారుడైన ఆత్మను దేవమనుష్యాదిరూప దేహములయందు బంధించుచున్నవి.

దీపికా-: ఏవం ప్రాచీన కర్మవశాత్సర్గాదౌ సత్త్వాదిగుణసంసర్గేణ దేవాదియోనిషు జాతానాం భూతానాం పునఃపునర్దేవాదిభావేన జన్మహేతుమాహ-
హే మహాబాహో+మహాంతౌ=ప్రకృతిగుణాయత్త బంధనిబంధనాయోధన సమర్థౌ, బాహూ యస్యేతి ప్రకృతిగుణై ర్బధ్యమాన పురుషబంధే నిదర్శనతయా సంబోధనం। రజస్తమ ఇతి। గుణాః=పృథివ్యాదీనాం గంధా

దయ ఇవ ప్రకృత్యాఖ్య ద్రవ్యస్వరూపానుబంధినః స్వభావవిశేషాః। ప్రకృతి సంభవాః - ప్రకృతితః సంభవంతి = మహదాది ష్వావిర్భవంతీతి తథాభూతాస్సంతః। పృథివీతః పుష్పాదిషు గంధాదయ ఇవేతి భావః। అవ్యయం=స్వభావతో న విద్యతే వ్యయః=సత్వాది కృతజ్ఞానసంకోచః। యస్య తం। తథాపి దేహే వర్తమానం। దేహినం=మహదాది పృథివ్యంత తత్త్వారబ్ధ దేహసంతతిమంతం పురుషం।నిబధ్నంతి=పునఃపున ర్దేవమనుష్యాదిరూపేణోత్పాదయంతీత్యర్థః ॥5॥

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ॥ 6

అర్థ-: హే అనఘ=పాపరహితుడవైన ఓ అర్జున; తత్ర=ఆ మూడు గుణములలో; సత్త్వం=సత్త్వగుణము; నిర్మలత్వాత్=(జ్ఞానమును అచ్ఛాదించునట్టి)దోషము లేనిదగుటవలన; ప్రకాశకం=జ్ఞానప్రకాశమును కలిగించునదియు; అనామయం=రోగమును కలిగింపనిదియు నగుచు; సుఖసంగేన=సుఖమునందలి ఆసక్తిచేతను; జ్ఞానసంగేన చ=జ్ఞానమునందలి ఆసక్తిచేతను; బధ్నాతి=(పురుషుని) బంధించుచున్నది.

తా-: అర్జున; సత్త్వరజస్తమోగుణములలో సత్త్వగుణము జ్ఞానప్రకాశమును సుఖమును అచ్ఛాదింపదు. అది దాని స్వభావము. కావున అది ప్రకాశసుఖములకు హేతువు అగుచు జ్ఞానసుఖములయందు ఆసక్తిని కలిగించును. అట్టి జ్ఞానసుఖాసక్తిచే పురుషుడు వైదికకర్మలయందు ప్రవర్తించి వానిఫలముల ననుభవించుటకు జన్మించుచుండును. ఈ రీతిని సత్త్వగుణము బంధక మగుచున్నది.

దీపికా-: సత్త్వాదీనాం నిబంధన ప్రకార మేవాహ- (తత్రేతి)

తత్ర=సత్త్వరజస్తమసాం మధ్యే। సత్త్వం=సత్త్వగుణః। నిర్మలత్వాత్=ప్రకాశవిరోధి తమస్స్వభావరూప మలరహితత్వాత్, ప్రకాశమాత్ర జనన స్వభావా దితి యావత్। ప్రకాశకం=వక్ష్యమాణరీత్యా ప్రకాశసుఖ హేతుభూత మిత్యర్థః। అనామయం - న విద్యతే ఆమయః=కార్యభూతో వ్యాధిః యస్య తత్।రజస్తమసీ వ్యాధిహేతూ; ఇదం త్వారోగ్యహేతురిత్యర్థః

హే అనఘ=న విద్యతే, అఘం=పాపరూప బంధహేతు సుఖసంగః, యస్య తథాభూత; 'కిం నో రాజ్యేన గోవింద కిం భోగై 'రిత్యుక్తేః సుఖసంగరహితేతి భావః। సుఖసంగేన=సుఖాసక్త్యా। జ్ఞానయోగేన చ=జ్ఞానాసక్త్యా చ। బధ్నాతి, దేహిన మిత్యత్రాపి అనుషజ్యతే। సత్త్వం పూర్వకర్మానుగుణ్యేన పురుషస్య సుఖాసక్తిం జ్ఞానాసంక్తిం చ జనయతి। సుఖజ్ఞానసంగే జాతే తత్సాధనేషు లౌకికవైదికకర్మసు ప్రవర్తతే, పునస్తత్ఫలానుభవార్థం యోని సంబంధ ఇతి బీజాఽంకురవ దనాది రయం బంధః సుఖజ్ఞాన సంగ ద్వారేణ సత్త్వసాధ్య ఇతి భావః అనేన జ్ఞానసుఖజనకం సత్త్వ మిత్యుక్తం భవతి ॥6॥

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి; తృష్ణాసంగ సముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌన్తేయ; కర్మసంగేన దేహినమ్॥ 7

అర్థ-: హే కౌన్తేయ=ఓ అర్జునా; రజః=రజోగుణమును; రాగ+ఆత్మకం=స్త్రీ పురుషుల ప్రేమకు ప్రేరకముగను; తృష్ణాసంగ సముద్భవం=(శబ్దాది విషయముయందలి) ఆశకు - (పుత్రాదుల యందలి) ఆసక్తికిని హేతువుగను; విద్ధి=తెలిసికొనుము. తత్=ఆ రజోగుణము; కర్మసంగేన=కర్మలయందు ఆసక్తిని కలిగించుటచేత; దేహినం=పురుషుని, నిబధ్నాతి=బంధించుచున్నది.

తా-: అర్జున; రజోగుణము స్త్రీ పురుషుల మధ్య ప్రేమను కలిగించును శబ్దాది విషయములయందును పుత్రమిత్రాదులయందును ఆసక్తిని కలిగించును. వీనివలన పురుషుడు కర్మలయందు ప్రవర్తించును. వాని ఫలముల ననుభవించుటకై జన్మించుచుండును. ఇట్లు రజోగుణము బంధకమగుచున్నది.

దీపికా-: హే కౌంతేయ। రజః=రజోగుణః। రాగాత్మకం=రాగః=యోషిత్పురుషయో రన్యోన్యస్పృహా, తదాత్మకం = తద్ధేతుభూత తృష్ణాసంగ సముద్భవం - తృష్ణా=శబ్దాది సకల విషయస్పృహా, సంగః=పుత్రమిత్రాదిసంబంధిషు సంశ్లేషస్పృహా,తయోః-సముద్భవం=ఉత్పత్తిస్థానం। విద్ధి=జానీహి।

తత్=రజః। కర్మసంగేన=తద్ధేతుభూత క్రియాసు స్పృహా జనన ద్వారేణ। దేహినం నిబధ్నాతి। విషయస్పృహయా దద్ధేతుభూత క్రియాస్పృహా; తయా తదనుష్ఠానం, తత్ఫలానుభవార్థం పునఃపునః యోనిసంబంధ ఇతి కర్మసంగ ద్వారేణ రజో బంధహేతు రిత్యర్థః ॥7॥

శ్లో॥ తమస్త్వజ్ఞానజం విద్ధి, మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్య నిద్రాభి, స్తన్నిబధ్నాతి భారత॥ 8

అర్థ-: భారత=ఓ అర్జున; తమః+తు=తమోగుణమున్ననో; అజ్ఞానజం=విపరీతజ్ఞానమువలన పుట్టినదని; సర్వదేహినాం=సమస్త ప్రాణులకు; మోహనం=విపరీతజ్ఞానమును కలిగించునదని; విద్ధి=తెలిసికొనుము. తతః=ఆ తమోగుణము; ప్రమాద+ఆలస్య నిద్రాభిః=ఏమరుపాటు ఆలస్యము నిద్ర అనువానిద్వారా; బధ్నాతి=బంధించున్నది.

తా-: అర్జున; తమోగుణము విపరీతజ్ఞానమువలన పుట్టుచున్నది. విపరీతజ్ఞానమును కలిగించుచున్నది. ఇది ఏమరుపాటును సోమరితనమును నిద్రను కలిగించుచు బంధహేతు వగుచున్నది.

దీపికా -: తమస్తు=తమోగుణస్తు। అత్ర 'తు' శబ్దేనపూర్వోక్త గుణద్వయాపేక్షయాఽస్యాఽత్యంత పరిహరణీయత్వ ముచ్యతే। అజ్ఞానజం - అజ్ఞానం - వస్తుతత్త్వజ్ఞాన వ్యతిరిక్తం విపరీతజ్ఞానం - తస్మాజ్జాతం, వస్తువిపరీత జ్ఞానజన్య పాపాఽనుష్ఠానకార్యమిత్యర్థః సర్వదేహినాం=బ్రహ్మాది ప్రాణినాం। మోహనం-విపరీతజ్ఞానజనకం చ విద్ధి। హే భారత। తత్=తమః। ప్రమాదాలస్యనిద్రాభిః- ప్రమాదః=అనవధానతా, విహితాదన్యత్ర ప్రవృత్తిరితి యావత్, ఆలస్యం - విహితేషు యథాకాల మప్రవృత్తిః; నిద్రా=ఇంద్రియ ప్రవర్తన శ్రాంతస్య పురుషస్య సకలేంద్రియ వ్యాపారోపరతిః; తత్ర బాహ్యేంద్రియవ్యాపారోపరతి స్స్వప్నః, మనసోపి వ్యాపరోపరతి స్సుషుప్తిరితి వివేకః; తాభిః దేహినం నిబధ్నాతి। పూర్వపూర్వ విపరీతజ్ఞానేన పాపానుష్ఠానం - తేన తమః-ఇత్యాది ప్రకారేణ బంధకం తమ ఇత్యర్థః ॥8॥

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి; రజః కర్మణి భారత।
జ్ఞాన మావృత్య తు తమః; ప్రమాదే సంజయత్యుత॥ 9

అర్థ-: భారత = ఓ అర్జున; సత్త్వం=సత్త్వగుణము. సుఖే= సుఖమునందు; సంజయతి=ఆసక్తి గావించుచున్నది. రజః=రజోగుణము; కర్మణి=కర్మయందు; సంజయతి=ఆసక్తిని గావించుచున్నది. తమః + తు=తమోగుణమన్ననో; జ్ఞానం=జ్ఞానమును; ఆవృత్య=ఆవరించి; ప్రమాదే + ఉత=విపరీతకార్యమునందు; సంజయతి=ఆసక్తినిగావించుచున్నది.

తా-: అర్జున; సత్త్వగుణము సుఖాసక్తిని రజోగుణము కర్మాసక్తిని; తమోగుణము విరుద్ధకార్యప్రవృత్తిని కలిగించుచున్నవి.

దీపికా-: బంధహేతుత్వే సత్త్వాదీనాం ప్రధాన వ్యాపారానాహ-

హే భారత। సత్త్వం = సత్త్వగుణః। సుఖే సంజయతి=దుఃఖశోకాది హేతుసత్త్వేపి తదభిభవేన సుఖే తద్ధేతుజ్ఞానే చ సంశ్లేషయతీత్యర్థః। రజః= రజోగుణః। కర్మణి। సుఖదుఃఖాది హేతుసత్త్వేపి తదభిభవేన రాగతృష్ణాది ద్వారాఽభిమత-స్తా తుకర్మణ్యేవ సంశ్లేషయతీత్యర్థః। తమస్తు=తమోగుణస్తు। జ్ఞానం=వస్తుయాథాత్మ్యజ్ఞానం। ఆవృత్య=ఆచ్ఛాద్య ప్రమాద ఉత। సంజయతి। విపరీతజ్ఞానజననద్వారా కర్తవ్య విపరీత వ్యాపారేపి సంగం జనయతీత్యర్థః। ఉతశబ్దా దాలస్యాదావపీత్యర్థః ॥9॥

శ్లో॥ రజస్తమశ్చాఽభిభూయ; సత్త్వం భవతి భారత।
రజస్సత్త్వం తమశ్చైవ; తమస్సత్త్వం రజస్తథా॥ 10

అర్థ-: హే భారత=ఓ అర్జున; సత్త్వం=సత్త్వగుణము; రజః=రజోగుణమును, తమః+చ=తమోగుణమును; అభిభూయ=తిరస్కరించి (మించి) భవతి=ప్రకాశించుచున్నది- రజః=రజోగుణము, సత్త్వం=సత్త్వగుణమును తమః+చ + ఏవ=తమోగుణమును; అభిభూయ భవతి=అతిశయించును. తమః=తమోగుణము. తథా=అట్లు; సత్త్వం=సత్త్వగుణమును, రజః=రజోగుణమును, అభిభూయ భవతి= అతిశయించియుండును.

తా-: అర్జున; ఈ మూడుగుణములలోను ఒక్కొక్కటి ఒక్కొక్కప్పుడు తక్కిన రెంటిని మించి తన కార్యమును సాధించుచుండును.

దీపికా-: నను దేహాకారపరిణతాయాః ప్రకృతేః స్వరూపానుబంధిన స్సత్త్వాదయో గుణాః కథమేవం పరస్పరవిరుద్ధ కార్యకరా భవంతీత్యత్రాహ (రజఇతి)

హే భారత! సత్త్వం=సత్త్వగుణః। రజః=రజోగుణం। తమశ్చ=తమోగుణం చ। అభిభూయ=తిరస్కృత్య।భవతి=ఉద్భవతి, యథా వాతపిత్తకఫానాం మధ్యే తత్తదుద్రేకకరాహారసేవాత స్తత్తత్కర్మానుగుణ్యేన చైకైక స్యోద్భవః ఇతరయోస్తదభిభవః తథా సాత్త్వికాహార సేవయా కర్మానుగుణ్యేన చ కదాచి త్సత్త్వస్యైవోద్భవః।ఇతరయో స్త్వభిభవశ్చేత్యర్థః। ఏవ ముత్తరయోరపి ద్రష్టవ్యం। తథా రజః=రజోగుణః।సత్త్వం=సత్త్వగుణం। తమశ్చైవ అభిభూయ। భవతి=ఉద్భవతి। తమః=తమోగుణః। సత్త్వం=సత్త్వగుణం। రజ=రజోగుణం చ అభిభూయ భవతీత్యన్వయః ॥10॥

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ 'ప్రకాశ' ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యా, ద్వివృద్ధం సత్త్వ మిత్యుత॥ 11

అర్థ-: అస్మిన్ దేహే=ఈ దేహమునందు।సర్వద్వారేషు=చక్షురాది-ఇంద్రియరూప మార్గములయందు అంతట; యదా=ఎప్పుడు; ప్రకాశే=వస్తువులను ప్రకాశింపజేయుటయందు; జ్ఞానం=జ్ఞానము; ఉపజాయతే=కలుగుచున్నదో; తదా=అప్పుడ; సత్త్వం=సత్త్వగుణము; వివృద్ధం + ఇతి=అతిశయించినది అని; విద్యాత్ =ఎఱుంగవలయును.

తా-: వస్తువులు ఉన్నవి ఉన్నట్లుగా ఎప్పుడు చక్షురాదింద్రియములద్వారా భాసించునో అప్పుడు మనశరీరమునందు సత్త్వగుణము అభివృద్ధిజెందియున్నట్లు గుర్తింపవలయును.

దీపికా-: ఏతచ్చ యథానుభవం కార్యోపలబ్ధేరేవాఽవగచ్ఛతీ త్యాహ-అస్మిన్=అత్మనః భోగాయతనే దేహే సర్వద్వారేషు=శ్రోత్రాదిషు।

జ్ఞానం=శబ్దాదిజ్ఞానాత్మకః ప్రకాశః। యదా=యస్మిన్కాలే। ఉపజాయతే=ఉత్పద్యతే। తదా త్వే=తస్మిన్ కాలేపి। సత్త్వం=సత్త్వగుణః। వివృద్ధః ఇతి విద్యాత్ - ప్రకాశలింగేన సత్త్వోద్భవం జానీయాత్। 'ఉత,శబ్దేన-సుఖేనాపి జానీయా దిత్యర్థః।అత స్సుఖప్రకాశాది కార్యమపి తద్వృద్ధి దశాయా మేవేతి భావః ॥11॥

శ్లో॥ లోభః ప్రవృత్తి రారంభః; కర్మణా మశమస్స్పృహా:।
రజస్యేతాని జాయన్తే; వివృద్ధే భరతర్షభ!॥ 12

అర్థ-: హేభరత+ఋషభ=ఓఅర్జున; రజసి=రజోగుణము; వివృద్ధే=అతిశయింపగా, లోభః=లోభము; ప్రవృత్తిః=నిష్ప్రయోజనమైన చాపల్యము; కర్మణాం= (ఫలమును కలిగించు) కర్మల; అరంభః=ప్రారంభము; అశమః=ఇంద్రియములు తృప్తిజెందకుండుట;స్పృహా=విషయేచ్ఛ; ఏతాని=ఇవి; జాయన్తే =కలుగుచున్నవి.

తా-: అర్జున! రజోగుణము అతిశయించినపుడు తన వస్తువులమీద అతిమమకారరూపమైన లోభము నిష్ప్రయోజనప్రవృత్తి; ఏదియో ఫలమును కోరి కార్యముల నారంభించుట ఇంద్రియములు తనివితీరకుండుట విషయాఽనుభవేచ్ఛ అనునవి కలుగును.

దీపికా-: హే భరతర్షభ। రజసి=రజోగుణే। వివృద్ధే=ఉద్భూతే సతి। లోభః=స్వకీయద్రవ్యస్యాఽత్యాగశీలతా। ప్రవృత్తిః=ప్రయోజన మనద్దిశ్యాఽపి చపలస్వభావతా। కర్మణాం=ఫలసాధనభూతానాం కర్మణాం;ఆరంభః=ఉపక్రమః। అశమః=ఇంద్రియాణా మనుపరమః, ఇదం కృత్వేదమిదం కరిష్యామీత్యాది సంకల్పవికల్పాఽనుపరమః। స్పృహా=విషయేచ్ఛా। ఇత్యేతాని కార్యాణి జాయంతే। యదా లోభాదయో జాయంతే తదారజః ప్రవృద్ధ మితి జానీయా దిత్యర్థః ॥12॥

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ; ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయన్తే; వివృద్ధే కురునందన॥ 13

అర్థ-: హే కురునన్దన, =ఓ అర్జున; తమసి =తమోగుణము,వివృద్ధే సతి =అతిశయించినపుడు; అప్రకాశః= జ్ఞానము కలుగకుండుట; అప్రవృత్తిః + చ =స్తబ్ధత; ప్రమాదః=ఏమరుపాటు; మోహః + ఏవ+చ=విపరీత జ్ఞానము; ఏతాని =ఇవి; జాయన్తే = కలుగుచున్నవి.

తా-: తమోగుణము అతిశయించినపుడు ఏ వస్తువు స్పష్టముగగోచరింపదు. స్తబ్ధత ఏమరుపాటు విపరీతజ్ఞానము కలుగును.

దీపికా-: హే కురునందన! అప్రకాశః= విషయే జ్ఞానాఽనుదయః। అప్రవృత్తిః= స్తబ్ధతా। ప్రమాదః =అకార్యప్రవృత్తి హేతుశ్చిత్తైకాగ్ర త్వాఽభావః! మోహ ఏవ చ= విపరీతజ్ఞానం చ ఇత్యేతాని తమసి వివృద్ధే జాయంతే! ఏభిస్తు తమోవృద్ధిం జానీయా దిత్యర్థః। వాతాది వ్యాధీనా ముల్బణతామివ సాంసారిక గుణత్రయ స్యోల్బణతాం తత్తత్కార్య విశేషోద్భవేన జ్ఞాత్వా చికిత్సాం కుర్యాదితి తాత్పర్యమ్ ॥13॥

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు; ప్రలయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే॥ 14

అర్థ-: యదా= ఎపుడు; సత్త్వే =సత్త్వగుణము; ప్రవృద్ధే+తు=అతిశయించినపుడు; దేహభృత్= ప్రాణి; ప్రలయం =మరణమును;యాతి= పొందునో; తదా =అపుడు; ఉత్తమవిదాం= ఉత్తమమైన ఆత్మతత్త్వమును ఎరిగినవారియొక్క; అమలాన్= పరిశుద్ధములైన; లోకాన్= సముదాయములను; యాతి =పొందుచున్నాడు.

తా-: సత్త్వగుణము అతిశయించియుండగా మరణించినవారు ఆత్మతత్త్వము నెరిగినవారి వంశమున జన్మించి (ఆత్మజ్ఞాన సాధనములైన పుణ్యకర్మలను జేయనర్హతనందుదురు).

దీపికా-: అంత్యకాలే రజస్తమస్సముద్భవహేతూనా మాహారాదీనాం పరిహారార్థ మంత్యకాలే ప్రవృద్ధానాం గుణానాం పృథక్ఫలా న్యాహ-

యదా=యస్మిన్కాలే। దేహభృత్=చేతనః। సత్త్వే తు=సత్త్వగుణే తు। ప్రవృద్ధే=ఉల్బణే సతి। ప్రళయం=దేహ నివృత్తిరూపం మరణం। యాతి=ప్రాప్నోతి। తదా=తస్మిన్కాలే। అమలాన్=పరిశుద్ధాన్। ఉత్తమవిదాం=సర్వోత్తరాత్మతత్త్వవిదాం। లోకాన్=సమూహాన్। ప్రతిపద్యతే=ప్రాప్నోతి। యదా సత్త్వం ప్రవృద్ధం భవతి తదైవ జీవో మ్రియతేచేత్ ఆత్మయాథాత్మ్యవి దాయతనేషు జనిత్వాఽఽత్మయాథాత్మ్య జ్ఞానసాధనే పరమపుణ్యేఽధికారీ భవతీత్యుక్తం భవతి ॥14॥

శ్లో॥ రజసి ప్రలయం గత్వా; కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీన స్తమసి; మూఢయోనిషు జాయతే ॥ 15

అర్థ-: రజసి=రజోగుణము; (అతిశయించినపుడు) ప్రళయం=మరణమును; గత్వా=పొంది; కర్మసంగిషు=ఫలాపేక్షతో కర్మలనాచరించువారి వంశమున; జాయతే=పుట్టును. తథా=అట్లే; తమసి=తమోగుణము (అతిశయించినపుడు; ప్రలీనః=మరణించినవాడు; మూఢయోనిషు పశువులు మొదలైన జాతులయందు; జాయతే=పుట్టును.

తా-: రజోగుణము అతిశయించియుండగా మృతిజెందినవారు స్వర్గాది ఫలాపేక్షతో కర్మల నాచరించువారి వంశమున జన్మింతురు. తమోగుణము అతిశయించినపుడు మరణించువారు పశ్వాదిజాతులయందు జన్మింతురు.

దీపికా-: అత్ర శ్లోకే ప్రవృద్ధ ఇతి పదం పూర్వ శ్లోకా దనువర్తతే। రజసి=రజోగుణే ప్రవృద్ధే సతి। ప్రళయం=మరణం। గత్వా=ప్రాప్య। కర్మసంగిషు=ఫలసంగేన కర్మకుర్వత్సు జాయతే। యదా రజః ప్రవృద్ధం; తదా మృతః కామ్యకృ దాయతనేషు జనిత్వా కామ్యకర్మ స్వేవాధికారీ భవతీత్యుక్తం భవతి। తథా తమసి=తమోగుణే। ప్రవృద్ధే సతి। ప్రలీనః=మృతః। మూఢయోనిషు=చండాలపశ్వాది యోనిషు। జాయతే। సకల పురుషార్థాఽనర్హ జాతిషూత్పద్యత ఇత్యర్థః ॥15॥

శ్లో॥ కర్మణస్సుకృతస్యాహుః; సాత్త్వికం నిర్మలం ఫలం।
రజసస్తు ఫలం దుఃఖ; మజ్ఞానం తమసః ఫలం ॥ 16

అర్థ-: సుకృతస్య=ఫలాపేక్షలేక చేయబడిన; కర్మణః=భగవదారాధన రూపమైన కర్మకు; ఫలం=ఫలము; సాత్త్వికం=మనుపటికంటె అధిక సత్త్వగుణము గలదై; నిర్మలం=దుఃఖలేశము సైతము లేనిదిగనుండునని; రజసః + తు=మరణకాలమున వృద్ధిజెందిన రజోగుణమునకు, ఫలం=ఫలము; దుఃఖం = పునర్జన్మరూపమైన దుఃఖము అని; తమసః=తమోగుణమునకు; ఫలం=ఫలము; అజ్ఞానం=అజ్ఞాన పరంపర (అని); ఆహుః=చెప్పుచున్నారు.

తా-: సత్త్వగుణము అతిశయించినదశలో మరణించినవారు ఆత్మతత్త్వజ్ఞుల వంశమున జనించి ఫలాపేక్షలేక కర్మలను భగవదారాధనరూపముగా చేయుచు మరింత సత్త్వగుణమును పెంచుకొని దుఃఖలేశము సైతము లేనివారై ఉందురు. రజోగుణము అతిశయించినదశలో మరణించినవారు ఫలాపేక్షతో కర్మల నాచరించువారి వంశమున జనించి ఫలాసక్తితో కర్మల నాచరించి జన్మపరంపరారూపమైన దుఃఖమును అనుభవింతురు. తమోగుణము అతిశయించినదశలో మరణించినవారు అజ్ఞానపరంపరలో నుందురు అని ఆయాగుణములను చక్కగ ఎరింగినవారు చెప్పుదురు.

దీపికా-: ఏవం అంతకాలే సత్త్వాదిగుణ ప్రవృద్ధిఫల మాత్మప్రదాయతనోత్పత్త్యాదిక ముక్త్వా తత్ఫల మాహ-

సుకృతస్య=ఆత్మవిత్కులోత్పన్నకృతస్య ఫలాఽభిసంధి రహితస్య। కర్మణః=మదారాధన రూపస్య। సాత్త్వికం=ఇతోఽధిక సత్త్వప్రధానం। నిర్మలం=దుఃఖలేశ సంబంధ రహితం। ఫలం ఆహుః। సత్త్వగుణ పరిణామ తత్త్వవిద ఇత్యర్థః। రజసస్తు=అంతకాల ప్రవృద్ధ రజోగుణస్య తు। దుఃఖం= దుఃఖప్రాయ కామ్యకర్మానుష్ఠాన పరంపరాం। ఫలం ఆహుః। రజః పరిణామ తత్త్వవిదో వదంతీత్యర్థః। అంతకాలే రజః ప్రవృద్ధ్యా రాజసగృహ జన్మ; తేన పునఃపునః కామ్యకర్మానుష్ఠానం ఇత్యేవం పరంపరయా దుఃఖమిశ్రమేవ ఫలం భవతీతి భావః। తమసః = అంత్యకాలప్రవృద్ధ తమోగుణస్య। అజ్ఞానం=అంత్యజాతీయ జన్మాదినాఽజ్ఞానపరంపరారూపం ఫలం। ఆహుః=తమః పరిణామ తత్త్వవిదో వదంతీత్యర్థః ॥16॥

శ్లో॥ సత్త్వా త్సంజాయతే జ్ఞానం; రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో; భవతోఽజ్ఞాన మేవ చ॥ 17

అర్థ-: సత్త్వాత్=అధికమైన సత్త్వగుణమువలన; జ్ఞానం=ఆత్మయాథాత్మ్య (అపరోక్ష) జ్ఞానము; సంజాయతే=కలుగుచున్నది రజసః=అట్టి రజోగుణమువలన; లోభః+ఏవ చ=లోభగుణము; తమసః=అట్టి తమోగుణమువలన; ప్రమాదమోహౌ=పరాకు విపరీత జ్ఞానము; అజ్ఞానం+ఏవ చ=అజ్ఞానము; భవతః=కలుగుచున్నవి.

తా-: ఇట్లు క్రమముగ వృద్ధిజెందిన సత్త్వగుణమువలన ఆత్మస్వరూపసాక్షాత్కారము కలుగును. ఇట్టి రజోగుణమువలన లోభము ఇట్టి తమోగుణమువలన అజ్ఞానము విపరీతజ్ఞానము ఏమరుపాటు కలుగుచున్నవి.

దీపికా:- ఏవ ముత్తరోత్తరాఽధిక సత్త్వాది జనిత నిర్మల ఫలాదికం కిమిత్యత్రాహ-

సత్త్వాత్=ఆత్మవిత్కుల జన్మాది క్రమేణోత్పన్నా దధిక సత్త్వాత్। జ్ఞానం=ఆత్మయాథాత్మ్యాఽపరోక్షరూపం జ్ఞానం జాయతే। తథా రజసః ఏవ చ=రాజసకుల జన్మాదినా ప్రవృత్తా ద్రజోగుణా దేవ। లోభః=స్వర్గాదిష్వతిసంగరూపః జాయతే। ఏవం తమస ఏవ చ। ప్రమాదమోహౌ=ప్రమాదః=అసత్కర్మ ప్రవృత్తిహేతు రనవధానతా, మోహః=విపరీత జ్ఞానం చేత్యుభౌ భవతః। అజ్ఞానం=జ్ఞానాఽభావశ్చ। భవతీతి వచన వ్యత్యయేన యోజ్యం। విపరీత జ్ఞానాచ్చండాల పశ్వాది యోనిషు జన్మ, తతశ్చ జ్ఞానాఽభావ ఇత్యర్థః ॥17॥

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా; మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా; అధో గచ్ఛన్తి తామసాః॥

అర్థ-: సత్త్వస్థాః=అధికసత్త్వగుణ నిష్ఠులు; ఊర్ధ్వం=ఊర్ధ్వలోకమును; గచ్ఛన్తి=పొందుచున్నారు. రాజసాః=అధికరజోగుణనిష్ఠులు; మధ్యే=మధ్యలో; తిష్ఠంతి=ఉందురు; తామసాః=అధికతమోగుణనిష్ఠులు; జఘన్యగుణవృత్తిస్థాః=మరింత నీచాఽతినీచములైన తమోగుణకార్యములందు నిమగ్నులై; అధః=క్రిందికి; గచ్ఛన్తి=పోవుచున్నారు.

తా-: క్రమముగ అతిశయించిన సత్త్వగుణముగలవారు ఉన్నత లోకములను పొందుచు చివరికి మోక్షము నందుదురు. రజోగుణాతిశయము గలవారు కర్మల నాచరించుచు జన్మపరంపరలలో కొట్టుమిట్టాడుచుందురు. అధికతమోగుణముకలవారు మరింత అధోగతిపాలగుదురు.

దీపికా-: తతోఽపి కిమిత్యత ఆహ -

సత్త్వస్థాః=అధికసత్త్వగుణనిష్ఠాః। ఊర్ధ్వం=ఉత్తరోత్తరోత్కృష్ట పదం। గచ్ఛన్తి ఆత్మవిత్కులాఽసంగ కర్మానుష్ఠాన శుద్ధసత్త్వాది పరంపరా నిశ్రేణికా సమారోహణేన ముక్తిం ప్రాప్నువంతీత్యర్థః। రాజసాః=రజోగుణనిష్ఠాః। మధ్యే=ఊర్ధ్వాఽధోలోక మధ్యదేశ ఏవ తిష్ఠన్తి। విషయాభిలాష తత్సాధనాఽనుష్ఠాన తత్ఫలానుభవార్థం జన్మ; పునర్విషయాభిలాషాది వాత్యా మండలో ద్భ్రాంతా అంతరాళ ఏవ తిష్ఠన్తీత్యర్థః। తామసాః=తమోగుణనిష్ఠాః జఘన్యగుణవృత్తిస్థాః-జఘన్యాసు=నీచాన్నీచతరాసు గుణవృత్తిషు తమోగుణ పరిణామేషు తిష్ఠన్తీతి తథాభూతాస్సంతః। అధః=నికర్షకాష్ఠాభూతం పదం గచ్ఛన్తి। తమసా విపరీతజ్ఞానం-తేన పాపానుష్ఠానం తేన చండాల పశు తిర్యక్క్రిమికీట తరుగుల్మలతాకాష్ఠ శిలాది ప్రాయాఽధోగతి భాజో భవంతీత్యర్థః ॥18॥

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం; యదా ద్రష్టాఽనుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19

అర్థ-: ద్రష్టా=ఆత్మానాత్మవివేకముగలవాడు; యదా=ఎప్పుడు; గుణేభ్యః= సత్త్వరజస్తమోగుణములకంటె; అన్యం= ఇతరమును; కర్తారం= కర్తనుగ; న + అనుపశ్యతి=చూడడో; గుణేభ్యః + చ=సత్త్వాదిగుణముల కంటె; పరం=భిన్నుని(అకర్త)గ; వేత్తి=(ఆత్మను) తెలిసికొనుచున్నాడో; సః=అతడు; మత్ + భావం=నా స్వభావమును; అధిగచ్ఛతి=పొందుచున్నాడు.

తా-: ఆత్మస్వరూపజ్ఞుడు సత్త్వాదిగుణములే కర్తలు గాని ఆత్మ కాదని ఎరింగినవాడై ముక్తినందుచున్నాడు (ఆత్మ గుణసంగముచే 'కర్త' యగుచుండుమగాని వాస్తవమున అతడు అకర్తయే).

దీపికా-: నను - "ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః" ఇతి సత్త్వనిష్ఠానాం ముక్తి రుచ్యతే, "గుణా నేతా నతీత్య త్రీ నమృత మశ్నుత" ఇతి గుణత్రయాఽతీతానాం ముక్తి రిత్యనంతరమేవ వక్ష్యతే, కథం విరుద్ధ ముభయం ఘటత ఇత్యాశంక్య విషయవ్యవస్థయా ఘటయతి-

యదా=యస్మిన్కాలే సాత్త్వికాహార సేవయాఽసంగ కర్మానుష్ఠానేన చ రజస్తమోభిభవేన సత్త్వవివృద్ధి దశాయా మిత్యర్థః। ద్రష్టా=వివిక్త దర్శీ జీవః; గుణేభ్యః=స్వానుగుణ ప్రవృత్తిషు కర్తృభ్యో గుణేభ్యః; అన్యం కర్తారం నాఽనుపశ్యతి, గుణా ఏవ సాంసారిక ప్రవృత్తిషు కర్తారః నాన్య ఇతి పశ్యతీత్యర్థః। నను ఆత్మవిదా మపి తత్తద్గుణోల్బణతా సమయే ప్రకాశాది తత్తత్కార్యాణా మనుభవసిద్ధతయా గుణకర్తృతాఽజ్ఞానసంభవా త్తేషా మపి భవద్భావాపత్తిస్స్యా దిత్యత్రాహ-(గుణేభ్యశ్చ పరం వేత్తీతి)గుణేభ్యః=తత్తత్సాంసారిక ప్రవృత్తి కర్తృభ్యో గుణేభ్యః। పరం చ=అన్య మకర్తృ స్వరూప మాత్మానం చ। వేత్తి=పశ్యతి। సః మద్భావం అధిగచ్ఛతి। అయం భావః- ఆత్మనః పరిశుద్ధ స్వభావస్యాపి పూర్వపూర్వ కర్మమూల గుణఫల సంగనిమిత్తం వివిధ కర్మసు కర్తృత్వం, స్వరూపత స్సకల సాంసారిక ప్రవృత్తిష్వకర్తేతి చ యదా సత్త్వవివృద్ధ్యా పశ్యతి, తదా స మద్భావం ప్రాప్నోతీతి। అతఏవ వివృద్ధ సత్త్వస్య ముక్తి హేతుత్వం సాంసారిక ప్రవృత్తి హేతో రశుద్ధసత్త్వస్య త్యాజ్యత్వం చేత్యుభయ మవిరుద్ధ మితి వివేచనీయమ్ ॥19॥

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే॥ 20

అర్థ -: దేహీ=జీవుడు; దేహసముద్భవాన్=దేహమువలన గలిగిన; ఏతాన్=ఈ, త్రీన్ గుణాన్=మూడుగుణములను; అతీత్య=అతిక్రమించి; జన్మమృత్యుజరాదుఃఖైః=జన్మము మరణము ముసలితనము వీనివలన కలుగు దుఃఖములచే; విముక్తః=విడువబడినవాడై; అమృతం=పరిశుద్ధాత్మను; అశ్నుతే=అనుభవించుచున్నాడు.

తా-: దేహాకారముగ పరిణమించు ప్రకృతివలన జనించిన సత్త్వాది

గుణములకంటె వేరై జ్ఞానైకాకారమైయున్న ఆత్మతత్త్వమును తెలిసినవాడు జన్మజరామరణదుఃఖములను వీడి పరిశుద్ధాత్మానుభూతిని పొందును. ఇదియే మద్భావము.

దీపికా-: అయం మద్భావః కీదృశ ఇత్యత్రాహ-

దేహీ=చేతనః। దేహసముద్భవాన్। ఏతాన్=పూర్వం సవిశేషం నిరూపితాన్; త్రీన్ గుణాన్=సత్త్వాదీన్। అతీత్య=సాత్త్వికాహార సేవాద్యుపబృంహితాత్మజ్ఞానః తేనాఽతిక్రమ్య। జన్మమృత్యు జరాదుఃఖైః-జన్మ=ఉత్పత్తిః, మృత్యుః=మరణం, జరా=జీర్ణతా, తత్కృతైః దుఃఖైః। విముక్తః=త్యక్తస్సన్। అమృతం=పరిశుద్ధ మాత్మానం। అశ్నుతే=అనుభవతి। అయమేవ తు మద్భావ ఇత్యర్థః ॥20॥

అర్జున ఉవాచ-:

శ్లో॥ కైర్లింగైస్త్రీన్గుణానేతా; నతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాం; స్త్రీన్గుణా నతివర్తతే॥ 21

అర్థ-: హే ప్రభో=ఓ శ్రీకృష్ణా; ఏతాన్=ఈ; త్రీన్ గుణాన్=మూడు గుణములను; అతీతః=అతిక్రమించినవాడు; కైః లింగైః=ఎట్టి లక్షణములతో; భవతి=(గుర్తింపదగి)ఉండును- కిం + ఆచారః = ఎట్టిప్రవర్తన గలిగియుండును. కథం=ఎట్లు; ఏతాన్=ఈ; త్రీన్ గుణాన్=మూడుగుణములను; అతివర్తతే=అతిక్రమించును.

తా-: శ్రీకృష్ణా, ఇతడు 'గుణాతీతుడు'అని గుర్తింపగల అతని బాహ్య-అభ్యంతర లక్షణము లేవి?. అతడు ఎట్లు ఈ సత్త్వాదిగుణములను అతిక్రమింపగలుగును?.

దీపికా-: అథ స్వావస్థా జిజ్ఞాసయా గుణాతీత స్యాంతర బాహ్యలక్షణాని పృచ్ఛ న్నర్జున ఉవాచ-

హే ప్రభో। కైః లింగైః=కీదృశై రాంతరచిహ్నైః। త్రీన్ గుణాన్=సత్త్వరజస్తమాంసి;అతీతః భవతి। గుణాతీత ఇతి జ్ఞేయ ఇత్యర్థః। కిమా

చారః-కః ఆచారఃయస్య సఃభవతి। కేనాచారేణ బాహ్యచిహ్నేన చ గుణాతీత ఇతి జ్ఞేయ ఇత్యర్థః। కథం చ=కేనోపాయేన త్రీన్ గుణాన్ అతివర్తతే=అతీతో భవతి ॥21॥

శ్రీ భగవానువాచ-:

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ; మోహమేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని; న నివృత్తాని కాంక్షతి॥ 22

అర్థ-: హే పాండవ=ఓ అర్జున; యః=ఎవడు; సంప్రవృత్తాని=(అనిష్టవిషయములయందు) ప్రవర్తించిన; ప్రకాశం చ=సత్త్వగుణకార్యమగు జ్ఞానప్రకాశమును; ప్రవృత్తిం చ=రజోగుణకార్యమగు కర్మప్రవృత్తిని; మోహం+ఏవ చ=తమోగుణకార్యమైన అజ్ఞానమును; న ద్వేష్టి=ద్వేషింపడో; నివృత్తాని=నివర్తించిన పై ప్రకాశప్రవృత్త్యాదులను; న కాంక్షతి=కోరాడో; (అతడు గుణాతీతుడు)

తా-: ఇష్టపదార్థములు వాని సాధనములు సంప్రాప్తములైనపుడు మరల వానిని కోరరాదు. ఇట్లే అనిష్టవస్తువులు వాని సాధనములు సంప్రాప్తించినపుడు వానిని ద్వేషింపరాదు. గుణాతీతుని స్వభావము ఇట్టిది.

దీపికా:- ద్వితీయాధ్యాయే "స్థితప్రజ్ఞస్య కా భాషా" ఇత్యాదినా పృచ్ఛతోఽర్జునస్యోత్తరే దత్తేఽపి పునః ప్రశ్నో విశేషాంతర బుభుత్సయేతి మత్వా ప్రకారాంతరేణోత్తరం శ్రీ భగవా నువాచ। తత్రాత్మవ్యతిరిక్తాని వస్తూని ద్విధానీష్టాన్యనిష్టాని చ. తత్ర గుణవశ్యస్యాఽనిష్ట తత్సాధనేషు ద్వేషః ఇష్ట తత్సాధనేషు నివృత్తేషు పున రాకాంక్షా లోకసిద్ధా. గుణత్రయాతీతస్య తద్విపరీత వృత్తిరేవ లక్షణ మిత్యాహ-

హే పాండవ। సంప్రవృత్తాని=స్వస్వవిషయ ప్రసృతాని, అనిష్ట తత్సాధన విషయాణీతి యావత్; న ద్వేష్టీతి క్రియాన్వయ స్వారస్యాత్। ప్రకాశం చ=సత్త్వకార్యభూత మవధ్య వస్త్వాద్యనిష్టాభాసం చ। మోహమేవ చ = తమః కార్యభూతం తేష్వేవేష్ట తత్సాధనత్వభ్రమం చ। ప్రవృత్తిం చ= రజఃకార్యభూతాం తాదృశభ్రమాఽధీనాం తేషు ప్రసక్తిం చ। ఏతాని న ద్వేష్టి। నివృత్తాని=స్వస్వవిషయాఽప్రవృత్తాని-ఇష్ట తత్సాధన విషయాణీతి

యావత్; న కాంక్షతీతి క్రియాన్వయస్వారస్యాత్। ప్రకాశం చ=సత్త్వకార్య భూతమిష్టవస్త్వవభాసం చ। మోహ మేవ చ=తమః కార్యభూతాం తేష్వత్యాసక్తించ. ప్రవృత్తించ-రజః కార్యభూతాం తదధీనాం తేషు ప్రసక్తిం చ। ఏతాని; ఇష్టవస్త్వవభాస తదాసక్తి తదధీన తత్ప్రసక్తీనాం నివృత్తి మితి యావత్; న కాంక్షతి-పునఃపున ర్నాఽభిలషతి। ఆత్మమాత్రసక్తస్య తదతిరిక్తేష్టానిష్ట ప్రాప్తిపరిహారాభ్యాం ప్రయోజనాఽభావాదితి భావః,“ ఏతే వై నిరయాస్తాత స్థానస్య పరమాత్మన” ఇతి స్వర్గస్వారాజ్యపర్యంత సుఖస్య తత్త్వతోఽనిష్టత్వా త్తదిష్టత్వజ్ఞానం భ్రమరూప మితి జ్ఞేయం ॥22॥

శ్లో॥ ఉదాసీనవదాసీనో; గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ; యోఽవతిష్ఠతి నేంగతే॥ 23

అర్థ-: ఉదాసీనవత్=తటస్థునివలె; ఆసీనః=ఉన్నవాడై; యః=ఎవ్వడు; గుణైః=గుణములచేత; న విచాల్యతే=చలింపచేయబడడో; గుణాః+ఏవ=గుణములే; వర్తన్తే+ఇతి= (తమతమ కార్యములయందు) ప్రవర్తించుచున్నవని (భావించి) యః=ఎవడు; అవతిష్ఠతి=తటస్థుడై ఉండునో; న+ఇంగతే=చలింపడో; (అతడు గుణాఽతీతుడు).

తా-: ఆత్మావలోకన సంతృప్తుడై ఇతరవిషయములయందు ఆసక్తి లేక తటస్థుడై సత్త్వాదిగుణములచే చలింపక ఆయా గుణములే తమతమ కార్యములను నిర్వర్తించుచున్నవని తలంచి స్థిరముగా నుండువాడు ‘గుణాతీతుడు’ అనబడుచున్నాడు.

దీపికా-: గుణాన్వితస్యాపి శరీరస్య సతః కథ మిష్టానిష్టసంతతౌ న విక్రియత ఇత్యత్రాహ-

యః, ఉదాసీనవత్=ఉదాసీనేన తుల్యం, ఆసీనః=తూష్ణీం స్థిత ఇత్యర్థః, ఆత్మావలోకనతృప్త్యా తద్వ్యతిరిక్తేఽనాసక్త ఇతి భావః, అత ఏవ, గుణైః=సత్త్వాదిభిః, న విచాల్యతే, ఏతదేవ వివృణోతి-(గుణా ఇతి)గుణాః =సత్త్వాదయః, గుణేషు=స్వస్వకార్యేషు, వర్తన్తే=ప్రవర్తన్తే, ఇత్యేవం=ఏవ మేవాఽనుసంధాయ, అవతిష్ఠతి=తూష్ణీమవతిష్ఠత ఏవ, ఉదాసీనవదిత్య

స్యేదం వివరణం, న విచాల్యత ఇత్యేతదపి వివృణోతి 'నేంగత' ఇతి) గుణ కార్య ద్వేష కాంక్షాఽనుగుణం న ప్రవర్తత ఇత్యర్థః ॥23॥

శ్లో॥ సమదుఃఖసుఖస్స్వస్థః స్సమలోష్టాఽశ్మకాంచనః
తుల్యప్రియాఽప్రియో ధీర; స్తుల్యనిందాత్మసంస్తుతిః॥ 24

అర్థ-: స్వస్థః=ఆత్మైకనిష్ఠుడును; సమదుఃఖసుఖః=సుఖదుఃఖముల యందు సమానచిత్తుడును; సమలోష్ట+అశ్మకాంచనః=మట్టిబెడ్డను రాతిని బంగారమును సమానముగ చూచువాడును; తుల్య ప్రియ+అప్రియః= ఇష్టాఽనిష్టవిషయములయందు సముడును; ధీరః=ప్రకృత్యాత్మల భేదము నెరింగినవాడును; తుల్యనిందాఆత్మసంస్తుతిః=తన నిందాస్తుతులయందు సమానచిత్తవృత్తిగలవాడును; ('గుణాతీతుడు' అనబడును.)

తా-: గుణాతీతుడు ఆత్మనిష్ఠుడై సుఖదుఃఖములు సంభవించినపుడు నిర్వికారుడై యుండును. మట్టిబెడ్డను రాతిని బంగారమును ఒకే విధముగా భావించును. ప్రియములు లేక అప్రియములు అయిన విషయములను సమానముగ తలంచును, ప్రకృత్యాత్మవివేకము కలిగియుండును. స్తుతినిం దలను గణింపడు.

శ్లో॥ మానాఽవమానయోస్తుల్య; స్తుల్యో మిత్రాఽరిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ; గుణాతీతస్స ఉచ్యతే॥ 25

అర్థ-: మాన+అవమానయోః=సమ్మానమునను అవమానమునను; తుల్యః=సమచిత్తుడును; మిత్ర+అరిపక్షయోః=మిత్రపక్షమునందు శత్రుపక్షమునందును: తుల్యః=సమచిత్తుడును; సర్వ+ఆరంభపరిత్యాగీ=సాంసారికప్రవృత్తులను పరిత్యజించినవాడును; సః=(ఎవడో) అతడు; గుణ+అతీతః=గుణములను జయించినవాడుగా; ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా-: మానావమానములను శత్రుమిత్రులను సమానముగ జూచుచు సాంసారిక ప్రవృత్తులను పరిత్యజించినవాడు సత్త్వాదిగుణములను అధిగమించుటచేత 'గుణాతీతుడు' అని చెప్పబడుచున్నాడు. 22 వ శ్లోకమునుండి ఇంతవరకు గుణాతీతుని లక్షణములు చెప్పబడినవి.

దీపికా-: స్వస్థః=స్వస్మిన్నేవ స్థితః, స్వాత్మైకప్రియః, అతఏవ సమదుఃఖ సుఖః - సమే=ఏకరూపే, దుఃఖసుఖే యస్య సః, పుత్రజన్మ మరణాభ్యామ ప్యవికృతచిత్త ఇత్యర్థః, అతఏవ సమలోష్టాఽశ్మ కాంచనః- సమాని=ఏకరూపాణి, లోష్టం=మృత్పిండః, అశ్మా=శిలా, కాంచనం=సువర్ణం, ఇత్యేతాని యస్య సః అతఏవ తుల్యప్రియాఽప్రియః-తుల్యౌ,ప్రియా ప్రియౌ=ఇష్టానిష్టవిషయౌ, యస్య సః, ధీరః - ధియం=ప్రకృత్యాత్మవివేకం, రాతి=ఆదత్త ఇతి ధీరః - ప్రకృత్యాత్మ వివేకకుశల ఇత్యర్థః, ఏభిర్విశేషణై రాంతర లక్షణాన్యుక్తాని, అథ తత్కార్య బాహ్యలక్షణా న్యాహ (తుల్యేతి) తుల్యనిందాత్మసంస్తుతిః, తుల్యే=ఏకరూపే, నిందా - దేహవైరూప్యాది ఖ్యాపనం,ఆత్మసంస్తుతిః=దేహసౌందర్యాది ఖ్యాపనం చ, ఏతే యస్య సః; వివిక్తాత్మదర్శినస్తస్మా దత్యంత వివిక్త దేహనిందాస్తుత్యోః పరనిందాస్తుత్యో రివ నాఽప్రీత్యాది సంభవ ఇతి భావః, అతఏవ మానావమానయో స్తుల్యః =మూర్ఖాః పూజిత పూజకాః"ఇతి న్యాయేన స్తుతినిందా ప్రయుక్త పురస్కార తిరస్కారయో రవికృతచిత్తః, అతఏవ మిత్రాఽరి పక్షయోరపి తుల్యః, దేహాత్మదర్శినాం మానయితా మిత్రం భవతి, అమానయితా రాతిర్భవతీతి లోకసిద్ధం - వివిక్తాత్మ దర్శినాం తు దేహ మానావమానాభ్యాం పరమానావమానాభ్యామివ చిత్త వికారాఽభావా దితి భావః, అతఏవ సర్వారంభ పరిత్యాగీ=ఆరభ్యంత ఇత్యారంభాః-కృత ప్రతికృత రూపాణి కార్యాణి, సర్వారంభాన్ పరిత్యక్తుం శీలమస్యేతి తథాభూతః, ఏవంభూతః, యః; సః, గుణాతీతః ఉచ్యతే, ఏవం బాహ్యంతరలక్షణై ర్గుణాతీత ఇతి జానీయా ఇతి జానీయా దిత్యర్థః ॥24 & 25॥

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ 26

అర్థ-: యః=ఎవడు; మాం=నన్ను; అవ్యభిచారేణ=చెదరని (దేవతాంతర స్పర్శలేని; భక్తియోగేన=భక్తియోగముచే; సేవతే=సేవించునో; సః=అతడు; ఏతాన్=ఈ; గుణాన్=సత్త్వాదిగుణములను; సమతీత్య=అతిక్రమించి; బ్రహ్మభూయాయ = బ్రహ్మభావముఁకొఱకు; కల్పతే=అర్హుడగుచున్నాడు.

తా-: ప్రకృత్యాత్మలను వివేకించినంత మాత్రమున గుణాతీతుడు

కాజాలడు. సత్యసంకల్పుడను పరమకారుణికుడను ఆశ్రితవత్సలుడను అయిన నన్ను అనన్యభక్తితో ఎవడు సేవించునో అతడే గుణాతీతుడై పరిశుద్ధాత్మస్వరూపమును పొందును.

దీపికా-: అథైవం రూపగుణాత్యయ హేతుమాహ,

యః=అనాదికాల ప్రవృత్త విపరీతజ్ఞానవానపి యోగీ, అవ్యభిచారేణ=దేవతాంతరాఽస్పర్శినా, భక్తియోగేన, మాం చ = సత్యసంకల్పం పరమకారుణిక మాశ్రిత వాత్సల్యైక జలధిం చ సేవతే। అత్ర 'చ'శబ్దేన దేహాత్మ వివేక స్సముచ్చీయతే। సః ఏతాన్ గుణాన్=దురత్యయానపి సత్త్వాది గుణాన్। అతీత్య = అతిక్రమ్య। బ్రహ్మభూయాయ=బ్రహ్మభావాయ, కల్పతే=యోగ్యో భవతి, యథాఽవస్థిత మాత్మాన మమృత మవ్యయం ప్రాప్నోతీత్యర్థః, దేహాత్మ వివేకమాత్ర స్యానాదికాల ప్రవృత్తి విపరీత వాసనా బాధనా సామర్థ్యాన్మద్భక్తి యోగః ప్రధాన సహకారితయాఽఽవశ్యక ఇతి భావః ॥26॥

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ; మమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ; ధర్మస్య; సుఖస్యైకాన్తికస్య చ ॥ 27

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ
విభాగయోగోనామ చతుర్దశోఽధ్యాయః-

అర్థ-: అహం=నేను; అమృతస్య=నాశరహితుడు; అవ్యయస్య=నిర్వికారుడునగు; బ్రహ్మణః+చ=పరిశుద్ధాత్మకును; శాశ్వతస్య=నిత్యమైన; ధర్మస్య చ=(ధర్మఫలమైన) నిరతిశయైశ్వర్యమునకును; ఐకాన్తికస్య=ఏకాంతులచే (జ్ఞానులచే) పొందదగిన; సుఖస్య చ=(మోక్ష)సుఖమునకును; ప్రతిష్ఠా=ధారకుడను (ప్రాపకుడను)

తా-: నాశరహితుడై జ్ఞానసంకోచరూప వికారరహితుడైన పరిశుద్ధ జీవాత్మ స్వరూపమునకును; అనగా కైవల్యమునకును; ఇంద్రాదుల ఐశ్వర్యమునకును; భగవత్ప్రాప్తిరూపమైన నిరతిశయసుఖమునకును ప్రాపకుడను నేనే. ఐశ్వర్య కైవల్య భగవల్లాభములను ఇచ్చువాడను నేనే అని భావము.

దీపికా-: అత్ర హేతు మాహ,

హి=యస్మాత్కారణాత్, అహం=అవ్యభిచారి భక్తియోగవిషయ ఇత్యర్థః, అమృతస్య=నిత్యస్య, అవ్యయస్య చ=జ్ఞాన సంకోచ రహితస్య చ, బ్రహ్మణః=పరిశుద్ధాత్మనః, ప్రతిష్ఠా=ప్రకాశనేన ధారకః, తత్ప్రాపక ఇత్యర్థః, శాశ్వతస్య=మద్భజన రూపస్య, ధర్మస్య చ=ధర్మఫలస్య చ, ఇంద్ర ప్రజాపత్యైశ్వర్యా దప్యుత్కృష్టైశ్వర్యస్య చేత్యర్థః, ప్రాపక వచనోపి ధర్మశబ్దోఽత్ర ప్రాప్య సాహచర్యా త్ఫలవచనః, ఐకాంతికస్య ఏకాంతాభిః=జ్ఞానిభిః, ప్రాప్యస్య, సుఖస్య చ="రసో వై సః; రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవ"తీతి శ్రుతి ప్రతిపాద్య నిరతిశయ సుఖస్య చేత్యర్థః, అహం ప్రతిష్ఠా=ధారకతయా ప్రాపక ఇత్యర్థః, అత్ర మధ్యమషట్క ప్రపంచితైశ్వర్య కైవల్య భగవల్లాభ ప్రదానం వివిక్తాత్మ ప్రాప్తిహేతుత్వ స్థాపనార్థ ముక్తమితి మంతవ్యం, ఏతదుక్తం భవతి-పూర్వత్ర- "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥" ఇత్యారభ్య గుణాతిక్రమస్య తత్పూర్వకాఽక్షరైశ్వర్య భగవత్ప్రాప్తీనాం చ భగవత్ప్రపత్తిమాత్ర సాధ్యతాయాః ప్రతిపాదితత్వాదేకాంత భగవత్ప్రపత్త్యైవ గుణాతీతత్వం తత్పూర్వక బ్రహ్మప్రాప్తిశ్చ భవతీతి ॥27॥

ఇతి శ్రీ భగవద్గీతా భాష్యార్థ సంగ్రహ తాత్పర్యదీపే
శ్రీ వరవరముని విరచితాయాం బాలబోధిన్యపరాభిధానాయాం
గీతార్థ సంగ్రహదీపికాయాం చతుర్దశోఽధ్యాయః ॥

— ० —

శ్రీరస్తు

గీతార్థ సంగ్రహః

శ్లో॥ గుణబంధవిధా తేషాం కర్తృత్వం తన్నివర్తనమ్।
గతిత్రయ స్వమూలత్వం చతుర్దశ ఉదీర్యతే ॥

అర్థ-: గుణబంధవిధాః= (పరిశుద్ధుడైన జీవునకు) సత్త్వాదిగుణములు బంధకములైన విధానము;తేషాం=ఆ గుణములకు;కర్తృత్వం=కర్తృత్వము ఏర్పడువిధానము; తత్+నివర్తనం=ఆ గుణముల నివృత్తి ప్రకారము; గతిత్రయ స్వమూలత్వం=ఐశ్వర్య కైవల్య భగవత్ప్రాప్తులు అనెడి మూడు గతులకును తానే (భగవంతుడే) మూల మనుటయు; చతుర్దశే=ఈ చతుర్దశాధ్యాయమున; ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా-: సత్త్వాదిగుణములు బంధకములగుట వాని కర్తృత్వము అవి నివర్తించువిధానము ఐశ్వర్య కైవల్య భగవత్ప్రాప్తులు మూడింటిని (ఆ భగవంతుడే) తానే మూలము అను విషయములు ఈ చతుర్దశాధ్యాయమున తెలుపబడినవి.



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భగవద్గీతామృతము

## పంచదశాధ్యాయము — పురుషోత్తమ ప్రాప్తియోగము

శ్రీ భగవానువాచ-:

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥ 1

అర్థ-: యం అశ్వత్థం=సంసారమనెడి ఏ అశ్వత్థవృక్షమును;ఊర్ధ్వమూలం=పైభాగమున వేరులు కలదనియు; అధశ్శాఖం=కొమ్మలు క్రిందికి గలదనియు; అవ్యయం=(ప్రవాహరూపమున) నిత్యమనియు;ప్రాహుః=(శ్రుతులు) చెప్పుచున్నవో; యస్య=ఏ సంసారమనెడి వృక్షమునకు; ఛందాంసి=(కామ్యకర్మ ప్రతిపాదకములైన) శ్రుతులు; పర్ణాని=ఆకులో, తం=అట్టి ఈ అశ్వత్థవృక్షమును; యః=ఎవడు; వేద=(చక్కగ) తెలిసికొను

చున్నాడో; సః=అతడు; వేదవిత్=వేదము నెరింగినవాడు.

తా-: సంసారము అనెడి అశ్వత్థ వృక్షమునకు సత్యలోకమునగల చతుర్ముఖ బ్రహ్మయే మూలము- సత్యలోకమునకు క్రిందగల లోకముల లోని నర పశు పక్ష్యాదులే కొమ్మలు. కామ్యకర్మలను ప్రతిపాదించు శ్రుతి వాక్యములే ఆకులు, ఇది ప్రవాహరూపమున నిత్యము. ఈ రహస్యమును తెలిసినవాడే వేదవేత్త. అనగా ఇట్టి సంసార వృక్షమును ఛేదింపగల వేదాన్తతత్త్వము నెరింగినవాడని భావము.

దీపికా-: పూర్వం త్రయోదశే ప్రథమ షట్కోదిత ప్రకృతి పురుష యాథాత్మ్య వివేచనం; తత్ర పరిశుద్ధస్యాపి జీవస్య బీజాంకురవ దనాదిభ్యాం భగవదాజ్ఞాతి లంఘనరూప దుష్కర్మానుష్ఠాన గుణఫలసంగాభ్యాం బంధః; ప్రకృతిపురుషవివేకసహకృత భగవద్భజనేన తన్నివృత్తిరితి చోక్తం,ఇదానీం భజనీయస్య మధ్యమషట్కోదితస్య పరమాత్మనో మహాత్మ్యం శోధయితుం బద్ధముక్తరూప విభూతిమత్తాం తాభ్యామపి వ్యాపన భరణస్వామిత్వాదిభి రత్యంతవైలక్షణ్యం చ వక్ష్యన్ సంగమూలస్య బంధస్యాఽసంగ శస్త్ర చ్ఛేద్యత్వ సిద్ధ్యర్థే వృక్షరూపతాం నిరూపయన్ శ్రీ భగవానువాచ-

ఊర్ధ్వమూలం=ఊర్ధ్వః- సప్తలోకోపరి నివిష్టశ్చతుర్ముఖః, మూలం= నిదానం, యస్య తమ్, అథశ్శాఖం, అథః=సత్యలోకా దధోలోకాః పృథివ్యా దయః, తేషు ప్రసృతాః=నరపశుమృగాది రూపాశ్శాఖాః, యస్య తమ్, అవ్యయం=వైరాగ్యమూలక తత్త్వజ్ఞానపర్యంతం ప్రవాహరూపేణానువర్త మానతయా నాశరహితం, అశ్వత్థం శ్వః ప్రాతరపి స్థాస్యతీతి నిశ్చేతు మశక్యం సంసారవృక్ష మిత్యర్థః, ఉత్తరశ్లోకవక్ష్యమాణస్య అసంగశస్త్రేణ ఛిత్త్వేతి వైరాగ్య ఛేద్యత్వస్య సంగమూలక సంసార ఏవాన్వయ స్స్వార స్యాత్, ప్రాహుః; "ఊర్ధ్వమూలోఽవాక్ఛాఖ ఏషోఽశ్వత్థస్సనాతన" ఇత్యా ద్యా శ్రుతయ ఇత్యర్థః, ఛందాంసి='వాయవ్యం శ్వేతమాలభేత భూతి కామ' ఇత్యాది కామ్య కర్మ ప్రతిపాదక వేదాః, యస్య=సంసారవృక్షస్య, పర్ణాని=పత్రవద్వర్ధకాని, తత్ప్రతిపాదితైః కామ్యకర్మభిర్హి సంసారో వర్ధతే, తం=సంసారరూప మశ్వత్థవృక్షం, యః వేద=యథావజ్జానాతి సః=పుమాన్,

వేదవిత్=వేదయత్యపవర్గోపాయ మితి వేదః=ఉత్తరభాగః; తం వేత్తీతి వేద విత్, వేదో హి సంసారవృక్షచ్ఛేదనోపాయం జ్ఞానం వదతి, ఛేద్యవృక్షస్వ రూపజ్ఞానం చ ఛేదనోపాయజ్ఞానోపయోగీతి సంసారతత్త్వజ్ఞ ఏవ వేదవిదితి భావః ॥1॥

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః।
అధశ్చ మూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే॥ 2

అర్థ-: తస్య=ఆ వృక్షముయొక్క; శాఖాః=(కొన్ని)కొమ్మలు; అధః + చ=క్రిందుగాను; ఊర్ధ్వం చ=మీదుగాను; ప్రసృతాః=ప్రసరించినవి; గుణప్రవృద్ధాః=సత్త్వాదిగుణములచే అధికముగా పెరిగినట్టివి; విషయప్రవాళాః=శబ్దాదివిషయములే చిగుళ్ళుగా గలవి. అధః + చ=క్రిందను; కర్మ + అనుబంధీని = కర్మపరంపరలనెడి; మూలాని=వేళ్ళు; అనుసన్తతాని=విస్తరించియున్నవి.

తా-: సంసారవృక్షముయొక్క శాఖలైన ప్రాణికోటి క్రిందనుండు మనుష్యాదిలోకములయందును పైనుండు స్వర్గాది లోకములయందును వ్యాపించియున్నది.అది సత్త్వాదిగుణములచే అభివృద్ధి నందుచున్నది.శబ్దాది విషయములు దాని చిగుళ్ళు. కర్మపరంపరారూపమైన దాని వేళ్ళు మనుష్య లోకమున విస్తరించియున్నవి.

దీపికా-: ఏవం నైమిత్తిక వ్యష్టిసృష్టి ముక్త్వా నిత్యసృష్టి ప్రకార మాహ-

తస్య=మనుష్యాది శాఖస్య సంసార వృక్షస్య,శాఖాః=పూర్వశాఖాభ్యః ప్రసృతా అపరశాఖాః, అధశ్చ=మనుషలోకాదిషు చ, ఊర్ధ్వం చ=దేవలోకాదిషు చ, ప్రసృతాః=తత్కర్మద్వారా తత్పుత్రపౌత్రాదిరూపేణ పశు మనుష్య దేవగంధర్వాది రూపేణ చోపశాఖా ఉద్భూతా ఇత్యర్థః, గుణప్రవృద్ధాః; గుణైః=సత్త్వాదిభిః, ప్రవృద్ధాః=జలసేకాదిభిరివ వర్ధితాః, విషయప్రవాళాః,

ఏవ, ప్రవాళాః=పల్లవాః, యాసాం తాః, పల్లవాహి వృక్షాగ్ర సంబంధినః, శబ్దాదయోపి సంసారవృక్షాగ్రభూత మనుష్యాదీనాం భోగ్యతయా సంబంధిన ఇతి భావః, తథాభూతాశ్చ భవంతీత్యన్వయః, నమూర్ధ్వమూలస్య వృక్ష స్యాధశ్శాఖాత్వం మూలానుసారాద్భవతు, అథశ్శాఖానా మూర్ధ్వ ప్రసరణం కథమిత్యత్ర ఆహ (అధశ్చేతి) అధశ్చ=మనుష్యలోకే చ, కర్మానుబంధీని= కర్మరూపాణ్యనుబంధీని, వాసనయాఽవిచ్ఛిన్నాని,మూలాని=శాఖామూలాని, అనుసంతతాని=వ్యాప్తాని, యథా ప్రాసాదాది శిఖరోత్పన్నా అధోలంబిన్యో లతాః క్షితి సంసర్గేణ పునస్సంచితమూలా ఊర్ధ్వం ప్రసరంతి, తద్వ దేవ మనుష్యాదిశాఖా అపి భూలోకమాగమ్య తత్ర సంచితకర్మరూపమూలాః కాశ్చిత్తత్రైవ ప్రసరంతి; కాశ్చిచ్చ దేవలోకాదౌ ప్రసరంతీతి భావః ॥2॥

శ్లో॥ న రూపమస్యేహ తథోపలభ్యతే
నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా ॥ 3

అర్థ-: అస్య=ఈ సంసారవృక్షముయొక్క; రూపం=రూపము; తథా=ముందుచెప్పినరీతిగా; ఇహ=ఇచట (సంసారమున) న+ఉపలభ్యతే= తెలియబడుటలేదు; అంతః=(దీని)నాశము; ఆదిః+చ=ఆది; సంప్రతిష్ఠా చ=ఉనికిపట్టు; న+ఉపలభ్యతే=తెలియబడుటలేదు; సువిరూఢమూలం= చక్కగా అనేకవిధముల మొలచిన వేళ్ళుగల; ఏనం=ఈ; అశ్వత్థం=అశ్వత్థ వృక్షమును; దృఢేన=దృఢమైన; అసంగశస్త్రేణ=అనాసక్తి=అను శస్త్రము చేత; ఛిత్వా=ఛేదించి;

తా-: ఈ సంసారవృక్షమునకు చతుర్ముఖబ్రహ్మ మూలము; దేవ మనుష్యాదులు కొమ్మలు. శబ్దాదివిషయములు చిగుళ్ళు. కాని ఇది ఎక్కడి నుండి వ్యాపించుచున్నది ఎప్పుడు నశించునది సంసారులకు ఎవ్వరికిని తెలియదు. విషయభోగములయందు 'అనాసక్తి'అనెడి దృఢమైన ఖడ్గముచే ఈ పాతుకొనిపోయిన సంసారవృక్షమును ఛేదింపవలయును.

దీపికా-: నను సర్వప్రత్యక్షసిద్ధేఽస్మిన్ సంసారే 'యస్తం వేదే'తి దుర్లభత్వాభిధాన మయుక్తం, అత ఆహ –

ఇహ=సంసారే, వర్తమానైః పురుషైః, అస్య=సంసారవృక్షస్య, రూపం=స్వరూపం, తథా=పూర్వోక్తప్రకారేణ నోపలభ్యతే, చతుర్ముఖ మూలత్వం; తత్సంతాన పరంపరయా మనుష్యాది రూపేణాధోలోక సంబంధః; మనుష్యత్వావస్థాయాం సంచితైః కర్మరూపఫలైః పునరప్యధ శ్చోర్ధ్వం చ శాఖోపశాఖాన్యాయేన ప్రసృతిరిత్యేవంవిధం రూపం; కేనాపి సంసారస్య వైరాగ్యేణ వినాశప్రకారశ్చ నోపలభ్యతే, ఆదిశ్చ=గుణఫల సంగేనోత్పత్తిశ్చ నోపలభ్యతే, తథా, సంప్రతిష్ఠా చ - స్థితికారణం చ, సంసా రమూల గుణఫలసంగస్యాపి నిదానం క్షేత్రాదిస్థానీయమనాత్మన్యాత్మ బుద్ధ్యాదిరూప మజ్ఞానమిత్యర్థః; తచ్చ, నోపలభ్యతే, సర్వోపి సంసారే మను ష్యోఽహం దేవదత్తపుత్రోఽహం, యజ్ఞదత్తపితా, అనురూపభార్యోఽహం ఇత్యేతావన్మాత్రం జానాతి. నాఽతోఽధికం సంసార యథావస్థిత రూపమితి భావః, అతస్సర్వదా దుర్విజ్ఞేయ స్వభావత్వా ద్యథాశాస్త్రమేవ తన్నివర్తన యత్నం కుర్యాదిత్యాహ (అశ్వత్థమిత్యాది) సువిరూఢమూలం=సువిరూఢాని సుష్ఠు అనాది; వివిధం చ రూఢాని,దురుచ్ఛేదాని వివిధాని కాయికవాచిక మానసికాదిభేదేన విహితనిషిద్ధాదిభేదేన చ బహువిధం నిరూఢాని మూలాని= కర్మరూపాణి, యస్య తమ్, ఏవం=పూర్వోక్తప్రకారం, అశ్వత్థం=సంసార వృక్షం, దృఢేన=సమ్యక్ జ్ఞానమూలత్వేనాఽతి దృఢేన, అసంగశస్త్రేణ - అసంగః గుణమయభోగేషు వైరాగ్యం, స ఏవ శస్త్రం=కుఠారః, తేన, ఛిత్వా= పృథక్కృత్య ॥3॥

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తంతి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యేత్
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥ 4

అర్థ-: తతః=ఆ 'అనాసక్తి'వలన; యస్మిన్=ఏ పరిశుద్ధాత్మ స్వరూప మున; గతాః=ప్రవేశించినవారు;భూయః=మరల;న నివర్తంతే=మరలిరారో

తత్=అట్టి; పదం=స్థానము (శుద్ధాత్మస్వరూపము); పరిమార్గితవ్యం=అన్వేషింపదగియున్నది. తం=ఆ; ఆద్యం=ప్రపంచమునకు ఆద్యుడైన; పురుషం=పరమపురుషుని; శరణం ప్రపద్యేత్=శరణు పొందవలయును. యతః=ఏ పరమపురుషునివలన; పురాణీ=పురాతనమైన; ప్రవృత్తిః=సాంసారిక ప్రవృత్తి; ప్రసృతా=ప్రసరించుచున్నదో.

తా-: సంసారవృక్షమును 'అనాసక్తి' (వైరాగ్యము) అనెడి ఖడ్గముతో ఛేదించి తద్ద్వారా పునరావృత్తిరహితమైన శుద్ధాత్మసాక్షాత్కారమునకై యత్నింపవలయును, మరియు ఈ సాంసారిక ప్రవృత్తి ఎవనివలన కలిగినదో అట్టి పరమపురుషుని శరణుపొందవలయును. బంధకుడైన అతని అనుగ్రహము వలననే బంధవిముక్తి కలుగునని భావము.

దీపికా-: తతః=అసంగాదేవ, యస్మిన్=పరిశుద్ధాత్మస్వరూపే, గతాః=యత్స్వరూపం ప్రాప్తాః, భూయః=పునరపి, న నివర్తంతి=నావర్తంతే, తత్పదం=ప్రాప్యస్వరూపం, పరిమార్గితవ్యం-"వేదా నిమం చ లోక మముం చ పరిత్యజ్యాత్మాన మన్విచ్ఛే"దితి శ్రుత్యుక్తరీత్యాఽన్వేషణీయ మిత్యర్థః, నను అనాదికాలప్రవృత్తో భోగసంగః తన్మూలవిపరీతజ్ఞానం చ కథం నివర్తత ఇత్యత్రాహ (తమేవేతి) ఆద్యం - 'మయాఽధ్యక్షేణ ప్రకృతి'రిత్యాద్యుక్తప్రకారేణ జగత్కారణభూతం, తమేవ చ=పూర్వషట్కప్రతిపాదితం పరమాత్మానమేవ, ప్రపద్య=శరణ ముపగమ్య, అత్ర 'ఏవ' కారేణ యదాజ్ఞోల్లంఘితా, స ఏవ ప్రసాదద్వారా బంధనివర్తనాయ శరణతయా వరణీయ ఇతి సూచ్యతే, తథైవ ప్రాచీనాచార మాహ (ఇయత ఇతి) ఇయతః=అజ్ఞాననివృత్త్యాదేః కృత్స్నస్య సంబంధినీ, తత్సాధనభూతేత్యర్థః, ప్రవృత్తిః, పురాణీ=చిరంతనీ సతీ, ప్రసృతా=అనుస్యూతా, పురాతనా హి ముముక్షవః 'తేషామేవాఽనుకంపార్థ మహ మజ్ఞానజం తమః, నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతే'త్యాద్యుక్తరీత్యా మచ్ఛరణాగతేరేవాఽజ్ఞాన నివృత్త్యాది హేతుత్వ మవగమ్య తేనైవ మార్గేణ నివృత్తాఽజ్ఞానా వినిర్ముక్తబంధా జాతా ఇత్యర్థః, అనేన శిష్టాచారః ప్రదర్శితః, ప్రపద్యేద్యతః ప్రవృత్తిరితి పాఠే తు, యతః=యస్మాత్పరమపురుషాత్, ప్రవృత్తిః=గుణమయ భోగసంగ ప్రవృత్తిః, పురాణీ=పురాతనీ సతీ, ప్రసృతా, ఆద్యం తమేవ చ శరణం ప్రపద్యేత్=ప్రపద్యేతే త్యర్థః, ప్రపద్యేదితి పరస్మైపదం

ఛాందసం, "దేవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరన్తి తే॥" ఇత్యాద్యుక్తరీత్యా, గుణమయభోగ సంగప్రవృత్తి మూలకారణంతమేవ పురుష మాద్యన్తన్నివృత్త యేఽపి శరణ ముపగచ్ఛేత్, నాన్యోస్తి కశ్చిదుపాయ ఇతి భావః ॥4॥

శ్లో॥ నిర్మానమోహా జితసంగదోషాః
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్॥ 5

అర్థ-: నిర్మానమోహాః=దేహాత్మాభిమానరూపమైన మోహము లేనివారు; జితసంగదోషాః=జయింపబడిన భోగాసక్తిగలవారు; అధ్యాత్మనిత్యాః=ఆత్మజ్ఞాననిష్ఠులు; వినివృత్తకామాః=(ఆత్మేతరవిషయములయందు) తొలగిన కోరికలుగలవారు; సుఖదుఃఖసంజ్ఞైః=సుఖము దుఃఖము అను పేరుగల; ద్వంద్వైః=ద్వంద్వములచేత; విముక్తాః=విడువబడినవారు; అమూఢాః=ఆత్మానాత్మల నెరింగినవారునగు జ్ఞానులు; తత్=ఆ; అవ్యయం=నాశరహితమైన; పదం=స్థానమును; గచ్ఛన్తి=పొందుచున్నారు.

తా-: ఆ పరమపురుషుని శరణుపొందుటచే దేహాత్మాభిమానము; తన్మూలకమైన భోగాభిలాష నశించి ఆత్మసాక్షాత్కారమునందు ఆసక్తి కలుగును. దానిద్వారా నిష్కాములు సుఖదుఃఖాది ద్వంద్వరహితులునై ఆత్మసాక్షాత్కారదశను పొందగలరు.

దీపికా-: తమేవార్థం ప్రపంచయతి -

నిర్మానమోహాః - నిర్గతః=మచ్ఛరణాగత్యానివృత్తః, మానః=దేహాత్మాభిమానః, తద్రూపః=మోహః - యేభ్యస్తే, అతఏవ జితసంగదోషాః - జితః సంగః - గుణమయభోగాసక్తిరేవ, దోషః - యైస్తే, అత ఏవ అధ్యాత్మనిత్యాః - అధ్యాత్మ=ఆత్మని వర్తమానం; స్వాత్మవిషయం జ్ఞానమిత్యర్థః;

తత్ర, నిత్యాః=నిరతాః, అతఏవ, వినివృత్తకామాః - వినివృత్తః=విశేషేణ నివృత్తః, కామః=తదితరవిషయాసంగః యేషాం తే, అతఏవ, సుఖదుఃఖ సంజ్ఞైః=సుఖదుఃఖే ఇతి సంజ్ఞా యేషాం తైః, అనుకూల ప్రతికూల స్వభావై రిత్యర్థః, ద్వంద్వైః=శీతోష్ణాదిభిః, విముక్తాః, అమూఢాః=ఆత్మానాత్మ తత్త్వ జ్ఞతయా సర్వ భ్రమ రహితాః, యోగినః, అవ్యయం=జ్ఞానసంకోచరహితం, తత్, పదం=అవిచ్ఛిన్న జ్ఞానైకాకారమాత్మానం, గచ్ఛంతి=ప్రాప్నువంతి, మచ్ఛరణాగతానామేవ తాస్సర్వాః ప్రవృత్తయ స్సుశకా స్సిద్ధిపర్యం తాశ్చ భవంతీత్యర్థః ॥5॥

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః।
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ 6

అర్థ-: తత్ = ఆ ఆత్మజ్యోతిని; సూర్యం=సూర్యుడు; న భాసయతే= ప్రకాశింపజేయడు; శశాంకః=చంద్రుడు; న (భాసయతే)=ప్రకాశింప జేయడు. పావకః=అగ్ని; న (భాసయతే)=ప్రకాశింపజేయడు. యత్ = ఏ ఆత్మజ్యోతిని; గత్వా=పొంది; న నివర్తన్తే=మరలిరారో; తత్=ఆ; పరమం= సర్వోత్కృష్టమైన; ధామ=జ్యోతిస్సు; మమ=నాది.

తా-: జ్ఞానస్వరూపమైన ఆ ఆత్మజ్యోతిని చంద్రసూర్యాదులు తమ కాంతిచే ప్రకాశింపజేయజాలరు. ఆ ఆత్మజ్యోతిని దర్శించినవారికి పునర్జన్మ యుండదు. చంద్రసూర్యాదులను సైతము ప్రకాశింపజేయు ఆ ఆత్మజ్యోతి నా అంశము అని భావము.

దీపికా-: తదేవ పదం విశినష్టి -

తత్=ప్రకాశరూప మాత్మస్వరూపం, సూర్యః, న భాసయతే=న ప్రకాశయతి, శశాంకః = చంద్రశ్చ, న భాసయతే, పావకః=అగ్నిశ్చ న భాసయతే, కింతు యోగ ఏవావభాసయతీతి భావః, ఆదిత్యాదయో హి జడాన్ భాసయంతి, తానపి జ్ఞానమేవ భాసయతి, ఆత్మానం తు యోగ ఏవ భాస యతీతి భావః, సంసారిణాం త్వనాదికర్మ యోగవిరోధి, తద్విరోధి చ మచ్ఛ

రణాగతిమూలక మసంగాదికమితి భావః, యత్=పరిశుద్ధాత్మస్వరూపం, గత్వా=ప్రాప్య, న నివర్తంతే=న పునరావర్తంతే, ధామ=ప్రకాశరూపం, పరమం=ఆదిత్యాదీనామపి భాసకం, తత్=వస్తు, మమ=మత్సంబంధి; విశేషణతయా మదంశః, పరమసామ్యాపత్తిదశాయామపి మచ్ఛేషభూతమేవేతి భావః ॥6॥

శ్లో॥ మమైవాఽంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7

అర్థ-: సనాతనః=అనాదియైన ఈ ఆత్మ; మమ=నాయొక్క; అంశః ఏవ సన్=అంశమే అగుచు; జీవలోకే=సంసారమునందు; జీవభూతః=(సంసారి) జీవుడై ; ప్రకృతిస్థాని=ప్రకృతిపరిణామములైన శరీరములయందు ఉండునవియు; మనః+షష్ఠాని=మనస్సును ఆరవ ఇంద్రియముగాగల; ఇంద్రియాణి=పంచేంద్రియములను; కర్షతి=లాగుచుండును.

తా-: అనాదియైన ఈ ఆత్మ నా అంశమే. కాని కర్మవశమున సంసారబద్ధుడై జ్ఞానసంకోచమును పొంది ప్రకృతిపరిణామములైన శరీరములయందు ప్రవేశించి తన భోగముకొరకు మనస్సు మొదలైన ఇంద్రియములను ప్రేరేపించుచుండును.

దీపికా-: నను యది జీవా స్త్వదంశాః తర్హి నిత్యసూరివర్గవత్సర్వేషాం పరిశుద్ధాకారయోగః కిం న స్యాదిత్యత్రాహ -

సనాతనః=పూర్వోక్తరీత్యాఽనాదిరనంతః మమ అంశ ఏవ - చిదచిద్విశిష్టే మయి విశేషణతయైకదేశశ్చిదంశ ఏవ, జీవలోకే=సంసారే, జీవభూతః=అనాదికర్మరూపాఽవిద్యావేష్టనేన జీవభావం ప్రాప్తస్సన్, ప్రకృతిస్థాని=శరీరాత్మక ప్రకృతినిష్ఠాని, మనష్షష్ఠాని - మనః షష్ఠం యేషాం తాని, ఇంద్రియాణి కర్షతి. కశ్చిదుక్తేన మార్గేణాఽవిద్యయా ముక్తః స్వరూపేణాఽవతిష్ఠతే. కశ్చిత్త్వనాది కర్మవేష్టిత శ్శరీరేంద్రియాద్యధిష్ఠాతా కర్మానుగుణం శరీరేంద్రియాదికం స్వభోగార్థం ప్రేరయతీత్యర్థః ॥7॥

అర్థం-: చేతసా మనస్సుతో; సర్వ కర్మాణి=సకల కర్మలను; మయి=నా యందు; సన్న్యస్య=సమర్పించి; మత్పరః=నన్నే ఫలముగ తలంచిన వాడవై; బుద్ధి యోగం=పరమాత్మయే కర్త అను బుద్ధిని; ఉపాశ్రిత్య=ఆశ్రయించి; సతతం=ఎల్లప్పుడు, మచ్చిత్తః=నాయందే లగ్నమైన మనస్సుగలవాడవుగ, భవ=అగుము.

తా-: నేను భగవచ్ఛేషభూతుడను, భగవన్నియామ్యుడను. నేను చేయు సకల కర్మలకు కర్త ఆ భగవంతుడే. అను జ్ఞానము కలిగి సర్వదా నన్నే ధ్యానించుచుండుము.

దీపికా: ఏవం సామాన్యత ఉపదిశ్య విశేషతో వ్యపదిశతి-

చేతసా సర్వ కర్మాణి మయి సన్న్యస్య 'మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా నిరాశీః' ఇత్యుక్త ప్రకారేణ జీవస్య మచ్ఛేషత్వ మన్నియామ్యత్వ విషయ బుద్ధ్యా సర్వాణి లౌకికాని వైదికాని యుద్ధాదీని చ కర్మాణి మత్కర్తృత్వాను సంధానేన మయి సమర్ప్యేత్యర్థః। మత్పరః-అహమేవ-పరః-ఫలతయా ప్రధానభూతః యస్య సః। మదేక ప్రాప్యత్వాభి సంధిమా నిత్యర్థః। బుద్ధియోగం ఉపాశ్రిత్య-కర్మానుష్ఠాన వేళాయా మిమమేవ బుద్ధియోగ ముపజీవ్యేత్యర్థః। సతతం మచ్చిత్తః భవ॥57॥

శ్లో॥ మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి।
అథ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి ॥58॥

అర్థ-: మచ్చిత్తః=నాయందే లగ్నమైన మనస్సుగల నీవు;మత్ప్రసాదాత్=నా అనుగ్రహమువలన; సర్వ దుర్గాణి=సకల ప్రతి బన్ధకములను; తరిష్యసి=దాటగలవు. అథ=అట్లుకాక; త్వం=నీవు; అహంకారాత్=అహంకారము వలన; న శ్రోష్యసి చేత్=(నా మాటను) వినవేని చో; వినంక్ష్యసి=నశింతువు.

తా-: సర్వమునకు కర్త భగవంతుడే అని భావించి వర్తించినచో నా అనుగ్రహమున సకల ప్రతిబన్ధకములను అతిక్రమింపగలవు. కాని నాడు నశింతువు.

దీపికా-: ఏవం నిత్య నైమిత్తిక కామ్యరూపాణాం దర్శిత బుద్ధి విశేష యోగ సహితానాం కర్మయోగ శబ్ద వాచ్యానాం పరంపరయా పరిపూర్ణ భగవత్ప్రాప్తి పర్యంత పరికర ముపపాద్య సర్వథా కర్మయోగ ఏవ కర్తవ్య ఇతి నిగమయన్ విపక్షేఽనిష్టమాహ-

మచ్చిత్తః-మయ్యేవ చిత్తం కర్తృత్వాను సంధాన రూపం యస్య సః, ఏవం సర్వదా కర్మాణి కుర్వ న్నిత్యర్థః, మత్ప్రసాదాత్ - తాదృశ కర్మానుష్ఠాన మూల మదనుగ్రహాత్, సర్వదుర్గాణి-సర్వాణి సంసార దుర్గాణి, తరిష్యసి, సంసారా ద్విమోక్ష్యస ఇత్యర్థః, అథ - ఏవం మదుప దేశానంతర మపి త్వం, అహంకారాత్ - అహ మేవ కృత్యాకృత్య వివేకం స్వయం జానామి-కిమన్యోప దేశేనేతి భావాత్, మదుక్తం న శ్రోష్యసి చేత్, వినంక్ష్యసి నిత్య సంసారితయా వినష్టో భవిష్యసి, నహి మద్వ్యతిరిక్తః కశ్చి త్కృత్యా-కృత్య విచక్షణః ప్రశస్తోఽస్తీతి భావః ॥ 8॥

శ్లో॥ యద్యహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥59॥

అర్థం= అహంకారం = అహంకారమును; ఆశ్రిత్య = అవలంభించి; న యోత్స్యే=యుద్ధము గావింపను; ఇతి=అని; యది మన్యసే=తలంతువేని; తే = నీయొక్క; ఏషః = ఈ; వ్యవసాయః = నిశ్చయము; మిథ్యా=అసత్య మైనది. త్వాం=నిన్ను; ప్రకృతిః = పూర్వ వాసన; నియోక్ష్యతి = (కర్మల యందు) ప్రవర్తింపజేయుగలదు.

తా-: అహంకరించి నా మాటను కాదని యుద్ధ మొనర్పనని నీవు తలంచినను ప్రకృతియే నిన్ను కర్మలయిందు ప్రవర్తింప జేయుగలదు.

దీపికా-: పూర్వత్ర స్వవాక్య శ్రవణ ఫలతయా యుద్ధాఽప్రవృత్తౌ వినాశ ఉక్తః, ఇదానీం యుద్ధ ప్రవృత్తి రన్యథా ప్యవశ్యం భావిన్యేవ-తవ మౌర్ఖ్యదోషః పర మధిక ఇత్యాశయే నాహ-

అహంకారం-అహమేవ సర్వం హితాహితం జానామీతి స్వాతంత్ర్యం ఆశ్రిత్య న యోత్స్యే=యుద్ధం న కరిష్యే ఇతి యది మన్యసే=అభిమన్యసే

చే దిత్యర్థః, తే=తవ ఏషః వ్యవసాయః = స్వాతంత్ర్యాభిమానః, మిథ్యా= అసత్య ఇత్యర్థః, తత్ర హేతు మాహ, ప్రకృతి రితి; ప్రకృతిః = పూర్వ వాసనా, నియోక్ష్యతి = ప్రేరయిష్యతి, మత్స్వాతంత్ర్య నియోగాభ్యాం వినాపి పశువ దజ్ఞం త్వాం యుద్ధే ప్రకృతి రేవ బలా త్ప్రేరయిష్య తీత్యర్థః ॥59॥

శ్లో॥ స్వభావజేన కౌంతేయః నిబద్ధ స్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్య స్యవశోఽపి తత్॥ ॥60॥

అర్థం-: హే కౌన్తేయ = ఓ అర్జున; యత్ = ఏ యుద్ధమును; మోహాత్=అజ్ఞానమువలన కర్తుం=చేయుటకు; న+ఇచ్ఛసి=కోరవో; తత్= ఆ యుద్ధమును: స్వభావజేన; క్షత్రియ సహజమైన; కర్మణా = (శౌర్యాది) కర్మచే; నిబద్ధః=బద్ధింప బడినవాడ_ అవశః+అపి=పరవశుడవయ్యును; కరిష్యసి=చేయగలవు.

తా-: అర్జున; అజ్ఞానమువలన ప్రస్తుతము యుద్ధమును మానినను; క్షత్రియ సహజమైన శౌర్యముచే శత్రువుల తిరస్కారమును సహింపలేక తప్పక యుద్ధమును చేయగలవు.

దీపికా-: తదేవోప పాదయతి-

హే కౌంతేయ, స్వభావజేన-స్వస్య-క్షత్రియస్య తవ, భావః-ప్రాచీన వాసనా, తజ్జాతేన, స్వేన = స్వకీయేన కర్మణా, 'శౌర్యం తేజ' ఇత్యాది పూర్వోక్తాఽసాధారణ ధర్మేణ, నిబద్ధః = శమీ వహ్ని వ దనుబద్ధః, మోహాత్= అజ్ఞానాత్, యత్ = యుద్ధాదికం కర్తుం నేచ్ఛసి, ప్రాప్తావసరేఽధర్మత్వ బుద్ధ్యా న చికీర్షసి, తదేవ, అవశోపి=అస్వతంత్రోపి వా, పర ధర్షణోద్భూత తమః ప్రేరిత స్సన్వా కరిష్యసి, గతజల సేతు బంధవ ద్వ్యర్థ వావశ్యం కరిష్యసీత్యర్థః ॥60॥

శ్లో॥ ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥ 61

అర్థ-: అర్జున=అర్జున; ఈశ్వరః=సర్వ నియంతయైన ఈశ్వరుడు; సర్వ భూతానాం-సకల ప్రాణులయొక్క; హృద్దేశే=హృదయమునందు; యంత్ర+ఆరూఢాని=శరీర మనెడి యంత్రము నధిష్ఠించియున్న; సర్వ భూతాని=సకల ప్రాణులను; మాయయా=గుణ త్రయ విశిష్టమైన ప్రకృతిచే; భ్రామయన్=త్రిప్పుచు; [ప్రవర్తింపజేయుచు] తిష్ఠతి=ఉన్నాడు.

తా-: అర్జున! శరీర మనెడి యంత్రమున నున్న సర్వ ప్రాణులను సర్వ జగన్నియామకుడైన సర్వేశ్వరుడు సత్త్వాది గుణానుగుణముగ నడిపించుచు వారి హృదయములయందుండును.

దీపికా-: నను త్వదౌదాసీన్యే చ కథ మచేతనయా ప్రకృత్యా మమ ప్రవృత్తి సంభవః? సంభవే వా కథం తవ సర్వ ప్రవృత్తి హేతుత్వ మిత్యత్రాహ -

హే అర్జున, ఈశ్వరః = నియంతా, నియమనానుకూల వ్యాప్తిమాన్ వాసుదేవ ఇతి యావత్, యంత్రారూఢాని-యంత్రం-ప్రవృత్తి నివృత్త్యనుకూల ప్రదేశ యుక్త రథరూపం శరీరం, ఆరూఢాని, సర్వభూతాని-'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ చ' ఇతి శ్రుత్యుక్త రీత్యా తత్తద్రథికత్వేనావస్థితాన్ సర్వా నాత్మాన ఇత్యర్థః, మాయయా, గుణ త్రయమయ్యా ప్రకృత్యా, భ్రామయన్- పూర్వ వాసనోద్భూత గుణానుగుణం, ప్రవర్తయ న్నిత్యర్థః, సర్వభూతానాం-తేషా మేవ ప్రాణినాం, హృద్దేశే-ప్రవృత్తి నివృత్తి హేతుభూత జ్ఞానోత్పత్తి దేశే, తిష్ఠతి=ఉదాసీనవదాస్తే, నహి భూతావేశన్యాయేన జీవమీశ్వరః ప్రవర్తయతి; అపితు సత్త్వాది గుణమయాన్ భావాన్ పురస్కృత్య పూర్వపూర్వ వాసనానుగుణ గుణ సంగ ద్వారేణేతి వాసనాయాః ప్రధర్షణాది వశా త్ప్రవర్తక త్వేపి నాత్మ ప్రవర్తకత్వ హానిః, నచౌదాసీన్యస్య వ్యాహతి శ్చేతి భావః ॥61॥

శ్లో॥ త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!।
తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62

అర్థ-: భారత=అర్జున; సర్వభావేన = సర్వవిధములు; తం+ఏవ= ఆ సర్వేశ్వరునే; శరణం గచ్ఛ=శరణు పొందుము. తత్+ప్రసాదాత్ =

అతని అనుగ్రహము వలన; పరాం=ఉత్కృష్టమైన; శాన్తిం=శాన్తిని; శాశ్వతం=పునరావృత్తి రహితమైన; స్థానం=పరమ పదమును; ప్రాప్స్యసి=పొందగలవు.

తా-: అర్జున; సర్వనియన్త అయిన సర్వేశ్వరుని అన్ని విధముల రక్షకునిగా తలంచి శరణు పొందుము. అతని అనుగ్రహమువలన శాంత పరమపదము నుద్ధింపగలవు.

దీపికా-: నను ఈశ్వరః స్వతంత్రో యది మాయయా జీవం ప్రవర్తయతి-పరతంత్రః కథం తాం నిరస్యే దిత్యత్రాహ-

హే భారత । త మేవ-సర్వ ప్రశాసితారము హ్యాశ్రిత వాత్సల్యేన త్వత్సారథ్యే స్థిత్వా యుద్ధం కుర్వితి హితోపదేష్టార మేవేత్యర్థః। అనేన పరత్వ సౌలభ్యే సూచితే। ఏవ కారేణ తత్ప్రయుక్త మాయాయా స్తదన్యేనాఽనివర్తనీయత్వ ముక్తం। సర్వభావేన- హితోపదేష్టృత్వ ప్రాప్యత్వ ప్రాపకత్వాది రూపేణ శరణం=గోప్తారం। గచ్ఛ=అవగచ్ఛ। అవశ్య మన్యథాపి భావిన్యా యుద్ధ ప్రవృత్తే ర్వినాశ హేతుత్వేన తదుపదిష్ట రీత్యైవ యుద్ధాది ధర్మం కుర్విత్యర్థః। ఏవం సతి, తత్ప్రసాదాత్-తస్య-సర్వేశ్వరస్య। ప్రసాదాత్=కర్మయోగానుష్ఠాన జనితానుగ్రహాత్। పరాం=ఉత్కృష్టాం। అపునరంతురా మితి యావత్। శాంతిం=సర్వకర్మ నివృత్తిం। శాశ్వతం=పునరావృత్తి రహితం। స్థానం తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః సతే హ నాకం మహిమాన స్సాచంతే యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః” ఇత్యాది శ్రుతి ప్రతిపాద్యం లోకం ప్రాప్స్యసి ॥62॥

శ్లో॥ ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా ।
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ 63

అర్థ-: ఇతి=ఇట్లు; తే=నీకు; మయా=నాచేత; గుహ్యాత్=రహస్యమైన దానికంటెను; గుహ్యం=మిక్కిలి రహస్యమైన; జ్ఞానం=కర్మ జ్ఞాన భక్తియోగముల జ్ఞానము; ఆఖ్యాతం=చెప్పబడినది. ఏతత్=దీనిని; అశేషేణ=సమగ్రముగ; విమృశ్య=విమర్శించి; యథా=ఎట్లు; ఇచ్ఛసి=కోరుకొందువో తథా=అట్లు; కురు=చేయుము

తా॥ వేద ప్రదర్శిత స్వర్గాది విషయక రహస్య జ్ఞానముకంటెను వేదాన్త దర్శిత మోక్ష ప్రద కర్మ జ్ఞాన భక్తి యోగముల జ్ఞానము మిక్కిలి రహస్యమైనది. అట్టి కర్మయోగాదులను నీకు ఉపదేశించితిని. దీనిని చక్కగ పరిశీలించి వీనిలో నీకు ఏది ఆచరణ యోగ్యమో దానిని ఆచరింపుము.

దీపికా-: గీతా శాస్త్రార్థం నిగమయతి -

ఇతి-పూర్వోక్తరీత్యా-సమ్యక్ సమగ్రం చేతి యావత్, గుహ్యాత్-గుహ్యతరం-జ్ఞానం-ఆయుర్ధను ర్గాంధర్వ వేదమూలా ల్లోక ప్రమాణ సిద్ధ విషయ జ్ఞానం గుహ్యం, తస్మాత్ ప్రకృష్టాతీంద్రియ పారలౌకిక స్వర్గాది సాధన జ్ఞానం వేదమూలం గుహ్యం, తతోపి వేదాంత తదుపబృంహణ విశోధితం ముముక్ష్వపేక్షితం యథాధికార మనుష్ఠేయం ముక్తిరూప ఫల వ్యవహితాఽవ్యవహితోపాయరూపం కర్మయోగాది త్రితయ జ్ఞానం గుహ్యతరం జ్ఞానం, మయా-సర్వజ్ఞేన పరమాత్మనా చ, తే-'శిష్యస్తేహం శాధి మా'మితి జిజ్ఞాసవే తుభ్యం, ఆఖ్యాతం=కథితం, ఏతత్=మదుక్తం, అశేషేణ=కార్త్స్న్యేన, విమృశ్య=సమ్యగ్విచార్య, యథా=యం ధర్మం ఇచ్ఛసి తథా=తం ధర్మం, కురు=ఆచర, యథాధికారం కర్మయోగం జ్ఞానయోగం భక్తియోగం వాఽనుతిష్ఠేత్యర్థః, అకరణేఽనిష్టస్య స్ఫుట ముక్తత్వా దిత్యవగంతవ్యమ్॥63॥

శ్లో॥ సర్వ గుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢ మతి స్తతో వక్ష్యామి తే హితమ్॥ 64

అర్థ-: సర్వ గుహ్యతమం=రహస్యము లన్నింటిలో మిక్కిలి రహస్యమైన; పరమం=ఉత్తమోత్తమమైన; మే=నాయొక్క; వచః=మాటను; భూయః=మరల; శృణు=వినుము. మే=నాకు; దృఢం=మిక్కిలి; ఇష్టః=ప్రీతి పాత్రుడవు; అసి+ఇతి=ఆయితివని; తతః=అందువలన; తే=నీకు; హితం=హితమును; వక్ష్యామి=ఉపదేశింతును.

తా-: అర్జున; నీవు నాకు మిక్కిలి ప్రీతి పాత్రుడవు; కావున రహస్యాతిరహస్యము ఉత్తమోత్తమము హితకారి అయిన ఒక విషయమును ఉపదేశింతును వినుము.

దీపికా-: ఏవం శాస్త్రార్థ భూతానాం త్రయాణాం మధ్యే భక్తి యోగస్య మోక్ష సాధనత్వేన సారార్థతయా పున స్తముద్ధృత్య శ్లోకద్వయేన ప్రత్యభిజ్ఞాపయతి -

సర్వగుహ్యతమం-సర్వేషు గుహ్యతరేషు కర్మయోగాదిషు-గుహ్యతమం-అతిశయేన గుహ్యం, పరమం=సాక్షా న్మోక్ష సాధన విషయత్వా త్సర్వోత్తరం వచః భూయః శృణు, 'ఇదం తు తే గుహ్యతమ' మిత్యాదినా 'మన్మనా భవే' త్యంతేన నవమాధ్యాయేన సునిరూపితత్వేపి సారార్థత్వాత్పున రాకర్ణయేత్యర్థః, ఏవ ముక్తి ర్నోపచ్ఛందనమాత్రం స్తుతిర్వేత్యాహ (ఇష్ట ఇతి) మే, దృఢం=అత్యర్థం, ఇష్టః-"ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ" మిత్యుక్త జ్ఞాని తుల్యః అసి ఇతి మత్వా, యేన పరమ హితోపదేశ యోగ్యోసి, తతః హేతో రిత్యర్థః, తే హితం-అవ్యవహిత ఫల సాధనం, వక్ష్యామి=ఉపదేక్ష్యామి ॥64॥

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మా మేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ 65

అర్థ-: మత్+భక్తః=నా భక్తుడవు; మన్మనాః=నా యందే లగ్నమైన మనస్సు గలవాడవు; మద్యాజీ=నన్నె పూజించువాడవు; భవ= అగుము;-మాం=నన్ను; నమస్కురు=ప్రణమిల్లుము. మామేవ=నన్నే; ఏష్యసి=పొందగలవు. మే=నాకు; ప్రియః=ఇష్టుడవుగ; అసి=ఉన్నావు. సత్యం = సత్యము; తే=నీకు; ప్రతిజానే=ప్రతిజ్ఞ గావించుచున్నాను.

తా-: అర్జున నిరతిశయ ప్రీతితో నన్నే ధ్యానించుచు ఆరాధించి నమస్కరింపుము. నాకు అత్యంత ప్రీతిపాత్రుడవైన నిన్ను నేను తప్పక నా యొద్దకు చేర్చుకొనగలను. ఇది సత్యము. ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

దీపికా-: గుహ్యతమాంగిస్వరూపం ఫలావ్యవహిత సాధనతయా నిరూపయన్ తత్స్వరూపం ప్రత్యభిజ్ఞాపయతి -

మద్భక్తః=మయి భక్తః, నిరతిశయ ప్రీతిమాన్, మన్మనాః=

మయ్యేవ మనో యస్య సః-మన్మనాః। భవ। మయ్యతిశయిత ప్రీత్యా సతతం మత్స్మృతి మేవ కుర్విత్యర్థః। మద్భక్తస్సన్। మద్యాజీ=మత్పూజన శీలో భవ। మయ్యతి ప్రీతి రూపారాధన మశేష శేషవృత్తి రూప మాచరేత్యర్థః। మద్భక్తస్సన్ మాం నమస్కురు। మయ్యతిమాత్ర ప్రీతిరూపం ప్రహ్వీభావ మాత్మీ యార్పణం చ కుర్విత్యర్థః। అత్ర సర్వాణ్యపి కర్మ విశేషణాని విశిష్ట క్రియారూప భక్తి లాఖాయ। ఏవం చ క్రియారూపతావన్నిరంతర స్మృత్యారాధనేచ్ఛానుసంధానాత్మికా భక్తిః మత్ప్రాప్తిసాధనమితి పర్యవస్యతీతి ధ్యేయం। ఏవం కుర్వన్ మామేవ ఏష్యసి = ప్రాప్స్యసి। తే=తుభ్యం। సత్యం=యాథార్థ్యం, ప్రతిజానే=ప్రతిజ్ఞాం కరోమి। యతః, త్వం మే, ప్రియః=ప్రీతివిషయః, అసి, మద్భక్తి యుక్తత్వాదేవ మమాత్యర్థ ప్రీతివిషయః, అత స్త్వద్విశ్లేషమ సహమానస్త్వాం మా మవశ్యం ప్రాపయామీత్యర్థః

శ్లో॥ సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66

అర్థ-: సర్వధర్మాన్=మోక్ష సాధనముల నన్నింటిని; పరిత్యజ్య=ఫలసంగ కర్తృత్వ త్యాగరూపమున; పరిత్యజించి; మాం=నన్ను; ఏకం=ఒక్కనినే; శరణం వ్రజ=శరణు పొందుము. అహం=నేను; త్వా=నిన్ను; సర్వ పాపేభ్యః=సమస్త పాపములనుండి; మోక్షయిష్యామి=విడిపింతును- మా శుచః=దుఃఖింపకుము.

తా-: అర్జున; శ్రేయస్సాధనములైన కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగములను-నేను కర్తను నేను ఫలభోక్తను ఇది నాది అనుఅభిమానమును త్యజించి ఆచరించుచు సర్వాంతర్యామియు ముముక్షు జన ప్రాప్యుడను మోక్ష ప్రాపకుడను సర్వ కర్మ సమారాధ్యుడను అయిన నన్నే ఉపాయముగ స్వీకరింపుము-ఫల ప్రదాతను నేనే. నీవు ఆచరించు ఆ అచేతనములైన కర్మాదులు కావు. అవి నశ్వరములు. ఇట్లు నీవునన్నే ఉపాయముగ స్వీకరించినచో; ఫలము నొసంగుటకు ఆవశ్యకములైన సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ స్వామిత్వ పరమ కారుణికత్వాది గుణ పరిపూర్ణుడనైన నేను అజ్ఞుడవు అశక్తుడవు అయిన

నిన్ను-నన్ను పొందుటకు ప్రతిబన్ధకములైన సకల పాపముల నుండి విడిపింపగలను నీవు శరణాగతి చేసిన పిదప నిన్ను రక్షించుకొను భారము నాది గదా.

ఈ శ్లోకమును శ్రీ వైష్ణవ సంప్రదాయము)న చరమ శ్లోక మని యందురు. చివరి ఉపదేశ శ్లోకమని అర్థము-ఇది ప్రపత్తి సిద్ధాంతమునకు ఉపోద్బలకము. జీవేశ్వరుల + రక్ష్య రక్షక భావము ఇందు స్పష్టముగ ప్రతిపాదింపబడినది,

దీపికా-: ఏవం విస్తర సంగ్రహాభ్యా ముక్తానాం కర్మయోగాదీనాం త్రయాణాం సారతమ మనుసంధాన విశేష ముద్ధృత్య తతఏవ మామే వైష్యసీత్యుక్తేష్టప్రాప్తి ప్రతిబంధక భూతాఽనిష్టానాం నివృత్తి మాహ-

సర్వధర్మాన్=పూర్వోక్తా నశేషాన్ ధర్మాన్ సాక్షాత్పరంపరయా చ శ్రేయ స్సాధనభూతాన్ కర్మయోగ జ్ఞానయోగా భక్తియోగాన్। పరిత్యజ్య-త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తిత' ఇత్యుక్త రీత్యా కర్తృత్వ మమతా ఫలాభిసంధి త్యాగేన త్యక్త్వేత్యర్థః, కర్మయోగే ఫలత్యాగ స్స్వర్గాది విషయః, జ్ఞానయోగే కైవల్య విషయః, భక్తియోగే ఐశ్వర్యాది ఫలాంతర విషయ ఇత్యవగంతవ్యం, మాం-'ఈశ్వర స్సర్వభూతానా' మిత్యుక్త రీత్యా అంతర్యామిణం, 'మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే స చరాచర' మిత్యుక్త రీత్యా ప్రాప్యం, 'మత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వత' మిత్యుక్త రీత్యా ప్రాపకం, 'అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ' చేత్యుక్త రీత్యా సర్వ కర్మారాధ్యం చ మాం, ఏకం-ముఖ్యం, శరణం=ఉపాయం వ్రజ=అవగచ్ఛ, అహం హి తత్తదారాధన ప్రీతః ఫలం దదామీతి సర్వశాస్త్ర సిద్ధః, అతో మామేవోపాయత్వే నానుసంధత్స్వ,న త్వవిదిత వేదాంతవత్-'ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞ రూపాః అష్టాదశోక్త మవరం యేషు కర్మ, ఏత చ్ఛ్రేయోఽభినందంతి మూఢా జరా మృత్యుం తే పునరేవాపి యంతీ'త్యాది శ్రుత్యుక్త రీత్యా నశ్వర సాధ్య యజ్ఞోపాసనాదికాన్ ధర్మా నితి భావః, అహం-ఉక్త ప్రకారేణారాధితః ఫల ప్రదానోపయుక్త సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ పరమ కారుణికత్వాది గుణ సంపన్న ఇతి భావః, త్వా-త్రివిధ త్యాగ యుక్తతయా ధర్మా ననుతిష్ఠంతం భవంతం, సర్వ పాపేభ్యః మజ్జ్ఞాన ప్రాప్తి ప్రతిబంధకాఽకృత్య

కరణ కృత్యాఽకరణ రూపేభ్యః, మోక్షయిష్యామి=విమోచయిష్యామి, మా శుచః=శోకం మా కృథాః, అథవా=మన్మనా భవేతి సారార్థతయా ప్రకృతస్య భక్తియోగస్య భగవత్ప్రియ పురుష నివర్త్యత్వేన తదారంభ విరోధి పాపానా మానంత్యా త్పరిమిత కాలేన పుంసా మనంత ప్రాయశ్చిత్తా చరణే ఽశక్తేః దీర్ఘకాల నైరంతర్య సేవనీయత్వేన దౌష్కర్యాచ్చ ఫల విళంబశంకయాఽఽత్మనో భక్తియోగారంభానర్హతయా శోచంత మర్జునం ప్రత్యాహ (సర్వేతి) సర్వ ధర్మాన్-అత్ర ధర్మశబ్దేన 'ధర్మేణ పాప మపను దతీ'తి శ్రుత్యుక్త ధర్మ సంగ్రహః, "సర్వ" శబ్దేన ప్రాయశ్చిత్తరూప ధర్మాణాం వివిధత్వం-బహువచనేనానంత్యం చ వివక్షితం, వివిధానంత ప్రాయశ్చిత్తరూప కృచ్ఛ్ర చాంద్రాయణాదీ నిత్యర్థః, పరిత్యజ్య=అశక్తస్య తవ దుష్కరతయా స్వరూపత ఏవ పరిత్యజ్యేత్యర్థః, ఏకం=అనేక ప్రతిభటం, మాం సర్వజ్ఞం సర్వశక్తం పరమ కారుణికం వాత్సల్య జలధించ శరణం ఉపాయం, 'శరణం గృహ రక్షిత్రో రుపాయే చ నిగద్యత' ఇతి కోశాత్, వ్రజ=రక్షిష్యతీతి మహావిశ్వాస పూర్వకాధ్యావసాయ రూప ప్రపదనం కురు, అహం-సర్వజ్ఞః సర్వశక్తిః త్వా=అల్పజ్ఞ మల్పశక్తిం చ భవంతం, సర్వ పాపేభ్యః=యథోదిత భక్త్యారంభ విరోధి సర్వ పాపేభ్యః, మోక్షయిష్యామి, మా శుచః, ఏకేన సుకరేణాఽవిలంబేన వివిధానంత పాప నివృత్త్యా వివిధై రనంతై ర్దుష్కరైః ఫల విళంబిభిః ప్రాయశ్చిత్తై ర్న శోకః కార్య ఇతి భావః, ఇదానీం భక్త్యారంభ విరోధి పాప నిబర్హణోపాయ తయా ప్రపదన నిర్దేశోఽన్యేషామపి దుష్కరేష్టోదాహరణ రూపః, అతః ఇత్థ మేవ సుదుష్కరేష్ట హేతు ప్రతిభటతయా సర్వత్ర శరణాగతి రేష్టవ్యా, అతఏవ 'సుదుష్కరేణ శోచే ద్యో యేన యేనేష్ట హేతునా, స స తస్యాహ మేవేతి చరమ శ్లోక సంగ్రహ'ఇత్యభియుక్తై రప్యుక్తమ్ ॥66॥

శ్లో॥ ఇదంతే నాఽతపస్కాయ నాఽభక్తాయ కదాచన ।
నచాఽశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి ॥ 67

అర్థ:- ఇదం=ఈ పరమ రహస్యమైన గీతాశాస్త్రమును; అతపస్కాయ=తపస్సు గావింపనివానికి; న వాచ్యం=చెప్పదగదు. అభక్తాయ=భక్తుడు కానివానికి; కదాచన=ఎన్నడును; న వాచ్యం=చెప్పతగదు. అశు

శ్రూషవే=శుశ్రూష గావింపనివానికిని; యః=ఎవడు; మాం=నన్ను; (చూచి) అభ్యసూయతి=అసూయజెందునో (వానికిని); న చ వాచ్యమ్ = చెప్ప దగదు.

తా-: అర్జున; ఈ గీతాశాస్త్ర రహస్యమును భోగములను సంకోచింప జేసికొని తపము గావింపనివానికి, నాయందు (ఉపదేష్టయందు) భక్తి లేని వానికి తపస్సు భక్తి కలిగియున్నను శుశ్రూష గావింపనివానికి ఇవి అన్నియు ఉన్నను నా స్వరూప రూప గుణ విభూత్యాదులయందు దోషిక దృష్టితో అసూయతో యుండువానికి ఉపదేశింపరాదు సుమా.

దీపికా-: అనధికార్యుపదేశ స్యాత్యంతాఽనిష్టత్వా త్ప్రథమత స్తన్నిషేధతి -

ఇదం=పరమ గుహ్యతమం శాస్త్రం, అతపస్కాయ న విద్యతే తపో యస్య తస్మై, అకృత తపస ఇత్యర్థః, తే=త్వయా, న వాచ్యం, అభ క్తాయ-'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మన' ఇతి శ్రుత్యుక్తరీత్యా మయి దేవే త్వయి వక్తరి చ భక్తి మనాచరతే పుంసే తప్త తపసేఽపి, కదాచన న వాచ్య మిత్యనుషంగః, అశుశ్రూషవే చ-మయి దేవే త్వయి వక్తరి చ భక్తాయ తప్తతపసేపి చ శుశ్రూషా మకుర్వతే చ న వాచ్యం, యః మాం అభ్యసూ యతి-మత్స్వరూప రూప గుణాదిషు శ్రుతేషు దోషా నావిష్కరోతి తస్మై చ పూర్వోక్త శుశ్రూషాది గుణసంపన్నాయాపి న వాచ్యం, నచాభ్యసూయత ఇతి పూర్వోక్త శైల్యా వక్తవ్యత్వేపి 'విద్యా హ వై బ్రాహ్మణ మాజగామ గోపాయ మా శేవధి స్తేఽహమస్మి, అసూయకాయానృజవే ఐడాయ న మాం బ్రూయా వీర్యవతీ తదా స్యా'మితి శ్రుతి స్మృతి నిషిద్ధతయాఽసూయక స్యాత్యంత పరిహరణీయత్వ జ్ఞాపనాయ విషమ శైల్యా నిర్దేశ ఇత్యవగం తవ్యమ్ ॥67॥

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మా మేవైష్య త్యసంశయః ॥ 68

అర్థ-: యః=ఎవడు; ఇదం=ఈ; పరమం=శ్రేష్ఠమైన; గుహ్యం=రహస్యమును; మద్భక్తేషు=నా భక్తుల (కు) యందు; అభిధాస్యతి=తెలియ జెప్పునో; (సః=అట్టివాడు); మయి=నాయందు; పరాం=ఉత్తమమైన; భక్తిం=భక్తిని; కృత్వా=కావించి; మాం+ఏవ=నన్నే; ఏష్యతి=పొందగలడు. న సంశయః=సందేహము లేదు.

తా-: అర్జున; ఈ గీతాశాస్త్ర రహస్యమును నా భక్తులకు చక్కగ వివరించి చెప్పునట్టివాడు నాయందు ఉత్తమోత్తమమైన భక్తి గలిగి నన్నే పొందును. సందేహము లేదు.

దీపికా-: ఏవ మనధికార్యుపదేశం నిషిద్ధ్యాధికా ర్యుపదేశస్య ఫల మాహ -

యః=పుమాన్ పరమం ఇదం గుహ్యం=రహస్యం, మద్భక్తేషు=మయి భక్తిమత్సు, అభిధాస్యతి వ్యాఖ్యాస్యతి, అనేన-'శ్రావయే చ్చతురో వర్ణా'నితి చాతుర్వర్ణ్యాధికారేపి భక్తానా మేవేదం వ్యాఖ్యాతవ్య మిత్యుక్తం భవతి, సః=పుమాన్ మయి పరాం భక్తిం కృత్వా=లబ్ధ్వా, భక్తేభ్యో వ్యాఖ్యానరూప కర్మయోగేనైవ భక్తిం ప్రాప్య, మామేవ, ఏష్యతి=ప్రాప్నతి, అత్రైవ కారేణాఽధికారిభ్యో గీతాం వక్తు ర్వ్యాఖ్యాతుశ్చ ఫలాంతరాఽనభిసంధిం జనయామీతి తాత్పర్యం ద్యోత్యతే, అసంశయః=అత్ర సంశయో నాస్తీత్యర్థః ॥68॥

శ్లో॥ న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥ 69

అర్థ-: మనుష్యేషు=మనుష్యులలో; తస్మాత్=ఆ గీతాశాస్త్రార్థ బోధకునికంటే; మే=నాకు; ప్రియకృత్తమః=మిక్కిలి ప్రీతిని కలిగించువాడు; కశ్చిత్=ఎవ్వడును; న చ=లేనేలేడు. తస్మాత్=అట్టివానికంటెను; మే=నాకు; ప్రియతరః=మిక్కిలి ప్రియమైనవాడు; అన్యః=మఱియొకడు; న చ భవితా=కలుగబోడు.

తా-: నా భక్తులకు గీతాశా రహస్యములను వివరించి చెప్పునట్టి

వాడు నాకు మిక్కిలి ప్రీతిపాత్రుడు-అతనికి మించిన ప్రీతిపాత్రుడు నాకు మరియొకడు లేనేలేడు.

దీపికా-: మనుష్యేషు=మనుష్యాణాం మధ్యే, తస్మాత్=గీతావ్యాఖ్యాతుః, అన్యః కశ్చిత్, ప్రియకృత్తమః, పూర్వ మతిశయేన ప్రియకారీ, నాఽభూచ్చ, కించ తస్మాత్ అన్యః, మే=మమ ప్రియతరః భువి=లోకే, న భవితా చ=న భవిష్యతి చ, 'ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యా' మితి విహిత బ్రహ్మవిద్యోపదేశేన మద్భక్త విషయే మహోపకారకత్వాత్ తత ఏవ భక్తిం లబ్ధ్వా ముచ్యత ఇతి భావః ॥69॥

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్ట స్స్యామితి మే మతిః ॥ 70

అర్థ-: యః=ఎవడు; ఇమం=ఈ; ధర్మ్యం = ధర్మ బద్ధమైన; ఆవయోః=మన ఇరువురియొక్క; సంవాదం = సంభాషణ రూపమైన గీతాశాస్త్రమును; అధ్యేష్యతే=(గురు ముఖతః) పఠించునో; తేన=అట్టివానిచేత; జ్ఞానయజ్ఞేన=జ్ఞాన యజ్ఞముచే; అహం=నేను; ఇష్టః = ఆరాధింపబడినవాడను స్యాం= అయ్యెదను; ఇతి=అని; మే=నా యొక్క; మతిః=నిశ్చయము.

తా॥ అర్జున మన ఇరువురి సంభాషణ రూపమున నున్న ఈ గీతాశాస్త్రమును గురుముఖతః అధ్యయన మొనర్చినవాడు జ్ఞానయజ్ఞముచే నన్ను ఆరాధించినవా డగుచున్నాడు-ఇది నా నిశ్చితాభిప్రాయము.

దీపికా-: ఏవ ముపదేష్టుః ఫలముక్త్వాఽధ్యేతు శ్శ్రోతుశ్చ ఫల మాహ ద్వాభ్యాం -

యః=పుమాన్, ధర్మ్యం=ధర్మా దనపేతం, ఇమం=వర్తమానం, సంవాదం=యుభత్సయోఽఽవయోః ప్రశ్నోత్తర రూపం సందర్భం, అధ్యేష్యతే=అధ్యయన మపి వా కరిష్యతే, గీతానా ముపనిష త్సారత్వా దధ్యేష్యతా ఇత్యుక్తిః, భారతస్య ధృతరాష్ట్రాదినా ముత్పత్తేః పూర్వ మేవ భగవత్ప్రసాదా త్కృతత్వేన జనమేజయముఖేన మనుష్యలోక ప్రవర్తన మభి

పేరితాధ్యేష్యత ఇతీదానీ మేవైత ద్గ్రంథాధ్యయనస్య భవిష్యత్త్వేన నిర్దేశః। తేన - పురుషేణ - తావన్మాత్రేణ। అహం - అవాప్త సమస్తకామః నిఖిల జగత్కారణభూతః లక్ష్మ్యాది పరిజన పరిచర్యమాణ ఇత్యర్థః। జ్ఞానయజ్ఞేన - జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే' ఇత్యుక్త భగవ దను సంధానరూప భక్తియోగేన। ఇష్టః - ఆరాధితః - స్యామ్। ఇతి మే మతిః = నిశ్చయః। యం యం క్రతు మధీతే తేన తేనా స్యేష్టం భవతీ'త్యధ్యయ నాఽనుష్ఠానయో స్సమాన ఫలత్వం శ్రూయతే। 'యోఽశ్వమేధేన యజతే య ఉ చైన మేవం వేదే' తిజ్ఞానానుష్ఠానయోశ్చ సమాన ఫలత్వం శ్రూ యతే। అతో గీతాధ్యాయన తదర్థ జ్ఞానాభ్యాం గీతా ప్రతిపాద్య జ్ఞానయోగా రాధనేనేవ ప్రసన్నో భవామీత్యర్థః ॥70॥

శ్లో॥ శ్రద్ధావా ననసూయుశ్చ శృణుయా దపి యో నరః।
సోఽపి ముక్త శ్శుభా న్లోకా న్ప్రాప్నుయా త్పుణ్య కర్మణామ్॥ 71

అర్థ:- శ్రద్ధావాన్=శ్రద్ధ గలవాడును; అనసూయుః + చ=అ సూయా రహితుడును అగు; యః=ఏ; నరః=పురుషుడు; శృణుయాత్ + అపి= గురుముఖముగ వినినను; సః + అపి=అట్టివాడును; ముక్తః=భక్తి విరోధి పాప విముక్తుడై; పుణ్యకర్మణాం=భగవ దారధకులయొక్క; శుభాన్=మం గళ ప్రదములైన; లోకాన్=సముదాయములను; ప్రాప్నుయాత్=పొం దును.

తా:- అసూయ రహితుడై శ్రద్ధతో ఎవడు ఈ గీతాశాస్త్రమును గురుముఖతః విని నేర్చుకొనునో అతడు భగవద్భక్తికి ప్రతిబన్ధకములైన పాపములనుండి ముక్తుడై భగవద్భక్తుల సత్సంగమున ప్రవేశించి భగవ దనుగ్రహ పాత్రుడగును.

దీపికా:- శ్రద్ధావాన్=ఆస్తిక్య బుద్ధిమాన్, అనసూయుశ్చ=వక్తరి ప్రతిపాద్యేచదోషావిష్కారరహితః। యః = నరః। శృణుయా దపి=ఆచార్య ముఖా త్ప్రర శ్రవణ మాత్రం కుర్యాదపీత్యర్థః। సోపి శ్రవణమాత్ర కర్తా వర్ణాశ్రమ విహిత ధర్మ పరిత్యాగ్యపి। ముక్తః=భక్తి విరోధి పాపై ర్విముక్త

స్వన్। శుభాన్=కల్యాణాన్। పుణ్యకర్మణాం=భగవ దారాధనరూప పుణ్య కర్మకృతాం। లోకాన్-సమూహాన్। ప్రాప్నుయాత్=గీతా శ్రవణ జనిత భగవ దనుగ్రహాత్ మహాత్మ సహవాస యోగోపదేశ ద్వారా ముక్తిం ప్రాప్నోతీ త్యర్థః। నతు నరక కల్ప స్వర్గం ప్రాప్నోతి - ప్రక్రమ విరోధా దితి ధ్యేయమ్ ॥71॥

శ్లో॥ కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ॥ 72

అర్థ-: హే పార్థ=ఓ అర్జున; ఏతత్=నేను చెప్పిన ఈ విషయము; త్వయా=నీచే; ఏకాగ్రేణ=సావధానమైన; చేతసా=మనస్సుతో; శ్రుతం కచ్చిత్= ఆకర్షింపబడినదా? హే ధనంజయ=ఓ అర్జున; తే=నీయొక్క; అజ్ఞానసమ్మోహః= అజ్ఞానమువలన కలిగిన మోహము; ప్రణష్టః కచ్చిత్=నశించినదా?

తా॥ అర్జున నేను చెప్పిన విషయములను సావధానముగ విన్నావు గదా - అజ్ఞాన మూలకమైన మోహముతోన బడి నేను యుద్ధము చేయ నంటివేఆ అజ్ఞానము ఇప్పుడు నశించినదా? చెప్పుము.

దీపికా-: అథ విదితాఽర్జునాఽభిప్రాయోఽపి భగవా నాదరేణాz విస్మరణ సిద్ధ్యర్థ ముపదేశ సాఫల్య మజానన్నివ పృచ్ఛతి-

హే పార్థ। ఏకాగ్రేణ=సావధానేన। చేతసా=చిత్తేన త్వయా ఏతత్= మదుక్త మర్థజాతం। శ్రుతం కచ్చిత్=మదుపదేశేన జ్ఞాతం కింవేత్యర్థః, హే ధనంజయ, తే=తవ, అజ్ఞాన సమ్మోహః=అజ్ఞాన మూలకో భ్రమః, ప్రణష్టః కచ్చిత్, నిశ్శేషం నివృత్తః కింవేత్యర్థః-యేన సర్వ థా "నయోత్స్యే" ఇత్యుక్తవా నితి భావః ॥72॥

అర్జున ఉవాచ :—

శ్లో॥ నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత।
స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ॥ 73

అర్థ-: హే అచ్యుత=ఆశ్రిత జన రక్షణమును వీడని ఓ శ్రీకృష్ణా; త్వ త్ప్రసాదాత్=నీ అనుగ్రహమువలన; మోహః=(నాయొక్క) మోహము; నష్టః=నశించినది. స్మృతిః=తత్త్వజ్ఞానము; మయా=నాచే; లబ్ధా=పొందబడి నది. గత సందేహః=వీడిన సంశయములు గలవాడనై; స్థితః+అస్మి= ఉన్నాను తవ=నీయొక్క; వచనం=యుద్ధము కావింపుము" అను మాటను; కరిష్యే=చేయగలను.

తా-: ఆశ్రిత రక్షణమున ఏమరుపాటు లేని ఓ శ్రీకృష్ణ భగవన్ నీ అనుగ్రహమువలన నా మోహము అనగా విపరీత జ్ఞానము నశించినది. తత్త్వజ్ఞానము లభించినది దీనిచే జ్ఞానైకాకారుడైన జీవాత్మ ప్రకృతికంటె విలక్షణుడని; జగత్కారణమైన పరబ్రహ్మము హేయ గుణ రహితము కళ్యాణ గుణాకరము స్వేతర సమస్త చేతనాఽచేతనములకును శేషి అని; ఇట్టి పరాఽ వర తత్త్వజ్ఞానమును దృఢముగ కలిగియుండి అనుదినము గావించు విహిత కర్మనుష్ఠానము భగవ త్ప్రాప్త్యుపాయ మని; ఇందులకు శమదమా ద్యాత్మ గుణములు - కర్మ జ్ఞానాఽనుగృహీత భక్తి రూపోపాసన మావశ్యకమని; అటి పరబ్రహ్మము పరమపురుష పురుషోత్తమ వాసుదేవాది శబ్ద వాచ్యుడవైన నీవే అని యథార్థమైన జ్ఞానము కలిగినది బన్ధు వధ భీత్యాది సందేహములు నశించినవి ఇక నీ ఆజ్ఞానుసారము యుద్ధము గావింతును

ఇట్లు "న యోత్స్యే"అనిన అర్జునునకు గీతోపదేశము గావించి భగ వంతుడు అతనినోటనే "కరిష్యే వచనం తవ"అని పలికించినాడు-

దీపికా-: అథార్జున స్స్వస్య కృతజ్ఞతాం ద్యోతయ న్నుపదేశ ఫల సిద్ధ్యుత్తరయతి-

హే అచ్యుత-అశ్రిత రక్షణాత్ చ్యుతి రహిత; మోహః=విపరీత జ్ఞాన రూపః, అనాత్మని ప్రకృతా వాత్మాభిమానరూపః భగవ దాత్మకస్య ప్రపం చస్య తదనాత్మక త్వాభిమానరూపః కర్మణో భగవ దారాధనతాయా తత్ప్రా ప్త్యుపాయభూత స్యాఽసాధనత్వాభిమానరూపశ్చ సర్వో మోహః, త్వత్ప్ర సాదాత్=తవ పరమ కారుణికస్య-అనుగ్రహాత్, నష్టః=నివృత్తః, స్మృతిః= జ్ఞాతృత్వైకాకారతయా స్వభావతః ప్రకృతి విలక్షణ ప్రత్యగాత్మ స్వరూప

నిఖిల జగ దుదయ లీలాఽ శేషదోష ప్రత్యనీక కళ్యాణైక స్వరూప స్వభావికాఽనవధికాతిశయాఽసంఖ్యేయ కళ్యాణ గుణగణ సర్వశేషి పరబ్రహ్మ శబ్దాభిధేయ పురుషోత్తమ జ్ఞానరూపా పరాఽవరతత్త్వజ్ఞానాభ్యాసపూర్వికా అహరహ రనుష్ఠీయమాన విహితకర్మ నిషిద్ధ పరిహార శమదమా ద్యాత్మగుణ నిర్వర్త్య భక్తిరూపోపాసన లభ్యో వేదాంత వేద్యః పరమ పురుషో వాసుదేవ స్స్వామితి జ్ఞానరూపా చభవ దుపదేశ జాత బుద్ధిరూపా స్మృతిః, మయా, లబ్ధా=ప్రాప్తా, గతసందేహః=నివృత్త సకల సంశయః స్థితః అస్మి, బంధు స్నేహ కారుణ్య వివృద్ధ విపరీత జ్ఞానమూల విషాదా ద్విముక్తోఽస్మీతి యావత్, తవ, వచనం=యుద్ధం కుర్వితి వాక్యం, కరిష్యే=యథోపదిష్టం యుద్ధాదికం కరిష్యామీత్యర్థః ॥73॥

సంజయ ఉవాచ :-

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥ 74

అర్థ-: ఇతి=ఈ విధముగా (జరిగిన) వాసుదేవస్య=శ్రీకృష్ణుని యొక్కయు; మహాత్మనః=గొప్ప బుద్ధిశాలి అయిన; పార్థస్య చ=అర్జునుని యొక్కయు; అద్భుతం=ఆశ్చర్యకరము; రోమహర్షణం=శరీరమును పులకితము గావించునది అయిన; ఇమం=ఈ; సంవాదం=సంభాషణమును; అహం=నేను; అశ్రౌషమ్=వింటిని.

తా-: ఈ రీతిగ శ్రీకృష్ణార్జునుల ఆశ్చర్యకరమైన ఈ సంవాదమును ధృతరాష్ట్ర మహారాజ నేను వింటిని.

దీపికా-: మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయేతి పృచ్ఛతే ధృతరాష్ట్రాయ సంజయో వక్తి -

ఇతీమం=పూర్వోక్తరూపం, అద్భుతం=అత్యాశ్చర్యం, అత ఏవ, రోమహర్షణం=పులకోద్గమకరం, వాసుదేవస్య=వసుదేవ సూనోః కృష్ణస్య, మహాత్మనః=మహాబుద్ధేః, పార్థస్య చ=పృథాయాః=తత్పితృష్వసుః కుంత్యాః పుత్రస్యార్జునస్య చ సంవాదం అశ్రౌషం=శ్రుతవానస్మి ॥74॥

శ్లో॥ వ్యాస ప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయత స్స్వయమ్ ॥7

అర్థ-: ఏతత్=ఈ; పరం = శ్రేష్ఠమైన; యోగం=యోగ మనబడు; గుహ్యం=రహస్యాతిరహస్యమైన ఉపదేశమును; స్వయం=తానుగా; కథయతః=చెప్పుచుండగా; యోగ + ఈశ్వరాత్=కళ్యాణ గుణ విశిష్టుడైన శ్రీకృష్ణునినుండి; వ్యాస ప్రసాదాత్ = వ్యాసుని అనుగ్రహమువలన; అహం= నేను; సాక్షాత్=సాక్షాత్తుగ; శ్రుతవాన్ + అస్మి=వినియున్నాను.

తా-: ధృతరాష్ట్ర మహారాజ, అనన్త కళ్యాణ గుణాకరుడైన శ్రీకృష్ణ పరమాత్మ స్వయముగ ఉపదేశించుచుండగా ఈ విషయములను నేను వ్యాసానుగ్రహ లబ్ధములైన దివ్య చక్షుశ్శ్రోత్రములతో వినగలిగితిని.

దీపికా-: నను దూరస్థ స్త్వం కథం శ్రుతవా నిత్యత్రాహ -

వ్యాస ప్రసాదాత్=వ్యాసానుగ్రహాత్, తదనుగ్రహ లబ్ధ దివ్య చక్షుశ్శ్రోత్రత్వా దితి యావత్, యోగం=యోగాఖ్యం, పరం=ఉత్కృష్టం, ఏతత్ గుహ్యం=గుహ్యతరం, యోగేశ్వరాత్- యోగః=కళ్యాణయోగః, తేన ఈశ్వరాత్=సర్వనియంతుః, సాక్షాత్ కథయతః-కృష్ణాత్, అవ్యవధానేన తస్మిన్ కథయతీతి యావత్, స్వయం శ్రుతవాన్=అహ మేవాశ్రౌష మిత్యర్థః ॥75॥

శ్లో॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76

అర్థ-: హే రాజన్=ఓ మహారాజ; కేశవ + అర్జునయోః=శ్రీకృష్ణార్జునులయొక్క; అద్భుతం=ఆశ్చర్యకరమైనది; పుణ్యం = పరమ పవిత్రమైనది అయిన; ఇమం=ఈ; సంవాదం=సంభాషణమును; సంస్మృత్య సంస్మృత్య= తలచితలచి; ముహుః + ముహుః=మాటిమాటికి; హృష్యామి=పరమానన్దభరితుడ నగుచున్నాను.

తా-: మహారాజ! శ్రీకృష్ణార్జునుల ఆశ్చర్యకరమైన ఈ పవిత్ర సంభాషణమును తలంచి తలంచి పులకితుడ నగుచున్నాను.

దీపికా-: దూరస్థోపి ప్రత్యక్షం శ్రుతవా నస్మీతి విస్మిత స్సన్నాహ ద్వాభ్యాం -

హే రాజన్=ధృతరాష్ట్ర, అద్భుతం, పుణ్యం=జ్ఞానయజ్ఞాదివ త్పరమ పావనం, కేశవార్జునయోః, ఇమం సంవాదం, ముహుర్ముహుః=పునఃపునః, సంస్మృత్య సంస్మృత్య=సాక్షా ద్భృశం స్మృత్వా స్మృత్వా, హృష్యామి చ-పునఃపునః పులకిత సర్వాంగో భవామి చ ॥76॥

శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః ॥ 77

అర్థ-: రాజన్=ఓ మహారాజ! హరేః=శ్రీకృష్ణునియొక్క; అత్యద్భుతం=మిక్కిలి ఆశ్చర్యకరమైన; తత్=ఆ; రూపం చ=విశ్వరూపమును; సంస్మృత్య సంస్మృత్య=తలచి తలచి; మే=నాకు; మహాన్=అధికమైన; విస్మయః=ఆశ్చర్యము, భవతి=కలుగుచున్నది.

తా-: మహారాజ! శ్రీకృష్ణుని దివ్యోపదేశమే కాక అతడు ప్రదర్శించిన ఆశ్చర్య కరమైన ఆ విశ్వరూపము సైతము నన్ను ఆనందాబ్ధి నోల లాడించుచున్నది.

దీపికా-: తత్-వ్యాసప్రసాదా త్సాక్షత్కృతం, హరేః=కృష్ణస్య, అత్యదుతం=అత్యంతాశ్చర్యం, రూపం చ=విశ్వరూపం చ, సంస్మృత్య సంస్మృత్య=అపూర్వత్వా త్పునఃపున స్స్మృత్వాస్మృత్వా హే రాజన్ మే మహాన్ విస్మయః, భవతి, విస్మయావేశో భవతీత్యర్థః, పునఃపునః హృష్యామి చ-పులకిత గాత్రో భవామి చేత్యర్థః ॥77॥

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥ 78

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే సకల శాస్త్రార్థ కథన
మోక్ష సన్న్యాసయోగో నామ అష్టాదశోఽధ్యాయః

అర్థ-: యత్ర = ఏ పక్షమునందు; యోగ + ఈశ్వరః = వివిధ రూపముల నున్న చేతనాఽచేతనముల వివిధ దశా యోగములకు కారకుడైన; కృష్ణః = శ్రీకృష్ణుడు; (ఉన్నాడో) యత్ర = ఏ పక్షమునందు; ధనుర్ధరః = గాండీవ ధనుస్సును ధరించిన; పార్థః = అర్జునుడు (ఉన్నాడో) తత్ర = ఆ పక్షమున; శ్రీః = సిరి; విజయః = విజయము; భూతిః = ఐశ్వర్యము; నీతిః = నీతియు; ధ్రువాః = స్థిరములు(గనుండును) ఇతి = అని; మమ = నాయొక్క; మతిః = దృఢాభిప్రాయము.

తా-: మహారాజ; శ్రీకృష్ణార్జునులు ఏ పక్షమున నుందురో ఆ పక్షమున నీతి విజయము సిరి సంపదలు కలుగు నని నా నిశ్చితాఽభిప్రాయము.

శ్లో॥ అత్రివంశ్య శ్రీనివాస
రామానుజ బుధేరితా ।
శ్రీ మద్రామానుజాచార్య
గీతాభాష్యాఽనుసారిణీ ॥

శ్రీమ ద్గీతాఽఽంధ్రటీకేయం
గీతాఽమృత సమాహ్వయా ।
గీతాచార్య పదాఽంభోజ
యుగళీమకరన్దతామ్ ॥

శ్రీ భగవ ద్గీతామృత మను గీతావ్యాఖ్యానము సమాప్తము.

దీపికా-: కిమత్ర బహునోక్తేన -

యత్ర, యోగేశ్వరః = కృత్స్నస్యోచ్చావచ రూపేణావస్థితస్య చేతనస్యాఽచేతనస్య చ వస్తునో యే యే యోగాః - తేషా మీశ్వరః - స్వ

సంకల్పాయత్త స్వేతర సమస్త వస్తు స్వరూప స్థితి ప్రవృత్తి భేదః, కృష్ణః=వసుదేవ సూనుః అస్తి, యత్ర ధనుర్ధరః పార్థః-తత్పిత్నష్వసుః పుత్ర స్తత్పదాంబుజ ద్వయైకాశ్రయోఽర్జునశ్చ అస్తి, శ్రీః విజయః భూతిః, నీతిశ్చ ఇత్యేతాః ధ్రువాః-నిశ్చలాః సంతి ఇతి మమ- మతిః-నిశ్చయః అస్తి ॥78॥

ఇతి శ్రీ భగవద్గీతా భాష్యార్థ సంగ్రహ తాత్పర్యదీపే శ్రీవరవర ముని విరచితాయాం బాలబోధి స్యవరాభిధానాయం గీతార్థ సంగ్రహ దీపికాయాం

అష్టాదశోఽధ్యాయః

గీతాశాస్త్రం సమాప్తమ్



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

గీతార్థ సంగ్రహః

శ్లో॥ ఈశ్వరే కర్తృతాబుద్ధిః సత్త్వోపాదేయతాఽన్తిమే ।
స్వ కర్మ పరిణామ శ్చ శాస్త్రసారాఽర్థ ఉచ్యతే ॥

అర్థ-: ఈశ్వరే=ఈశ్వరునియందు; కర్తృతాబుద్ధిః=కర్తృత్వాను సన్ధానము; సత్త్వ+ఉపాదేయతా=సత్త్వగుణముయొక్క ఉపాదేయత్వము; స్వ కర్మ పరిణామః+చ=తాను కావించు వర్ణాశ్రమ కర్మల పరిణామము; శాస్త్ర సార+అర్థః=గీతాశాస్త్ర సారమైన భక్తియోగ మున్ను; అన్తిమే=చివరిదైన ఈ అధ్యాయమునందు; ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా-: మనము చేయు సకల కర్మలకు కర్త సర్వేశ్వరుడే అని సత్త్వ గుణమును పెంపొందించుకొనవలయు నని వర్ణాశ్రమోచిత కర్మలను భగవ

దారాధనా బుద్ధితో ఆచరించినచో అవి పరమ పురుష ప్రాప్తి నిర్వర్తకము లుగ పరిణమించునని గీతాశాస్త్ర సారము భక్తి యని ఈ చివరి అధ్యాయ మున విశదీకరింపబడినది.

శ్లో॥ కర్మయోగ స్తప స్తీర్థ దాన యజ్ఞాది సేవనమ్ ।
జ్ఞానయోగో జితస్వాన్తైః పరిశుద్ధాత్మని స్థితిః ॥

అర్థ-: తపః సేవనమ్=తపస్సు తీర్థము (పవిత్ర క్షేత్రాదికము) దానము యజ్ఞము మొదలగువానిని ఆచరించుట; కర్మయోగః=కర్మయో గము-జిత స్వాన్తైః=జయింపబడిన మనస్సుగలవారిచే; పరిశుద+ఆత్మని= కేవల జ్ఞానైకాకారమైన జీవాత్మ స్వరూపమునందు; స్థితిః = ధ్యాననిష్ఠ; జ్ఞాన యోగః=జ్ఞానయోగము.

తా-: యజ్ఞ దాన తప స్తీర్థాది సేవనము కర్మయోగ మనబడుచు న్నది. కేవల జ్ఞానైకాకారమైన జీవాత్మను నిరంతరము ధ్యానించుట జ్ఞాన యోగ మనబడుచున్నది.

శ్లో॥ భక్తియోగః పరైకాన్త ప్రీత్యా ధ్యానాదిషు స్థితిః ।
త్రయాణా మపి యోగానాం త్రిభి రన్యోన్య సంగమః ॥

అర్థ-: పర+ఏకాన్త ప్రీత్యా=సర్వేశ్వరుని యందలి తదేక ప్రీతిచే; ధ్యాన+ఆదిషు=ధ్యానార్చన ప్రణామాదులయందు; స్థితిః=నిష్ఠ; భక్తి యోగః=భక్తియోగము-త్రయాణాం=మూడు విధములుగ నున్న; యోగా నాం+అపి=ఈ కర్మ జ్ఞాన భక్తియోగములకును; త్రిభిః=ఈ మూడింటితో; అన్యోన్య సంగమః=పరస్పర సంబన్ధము ఉండును.

తా-: భగవంతునియందు నిరతిశయ-అనన్య ప్రీతిచేత గావించు భగవద్ధ్యానారాధనాదులయందలి నిష్ఠ భక్తియోగ మనబడుచున్నది. ఈ మూడు యోగములు పరస్పరము కలిసియుండును. అనగా కర్మయోగమున జ్ఞాన భక్తియోగములు; జ్ఞాన యోగమున కర్మ భక్తి యోగములు, భక్తి యోగమున కర్మ జ్ఞాన యోగములు అంగముగ నుండును.

శ్లో॥ నిత్యనైమిత్తికానాం చ పరారాధన రూపిణామ్ ।
ఆత్మదృష్టేః త్రయోఽప్యేతే యోగద్వారేణ సాధకాః ॥

అర్థ-: పర+ఆరాధన రూపిణాం=భగవదారాధన రూపములైన; నిత్య నైమిత్తికానాం చ=నిత్య నైమిత్తిక కర్మలకును, (త్రిభిః=మూడు యోగములతో; సంగమః=సంబద్ధము గలదు)-ఏతే=ఈ; త్రయః+అపి=మూడు యోగములున్ను; యోగద్వారేణ=సమాధిరూప యోగముద్వారా ఆత్మ దృష్టేః=ఆత్మ దర్శనమునకు; సాధకాః=సాధకములు.

తా-: కర్మయోగాది నిష్ఠులు భగవదారాధనరూపమున నిత్య నైమిత్తిక కర్మలను అవశ్యము అనుష్ఠింపవలయును-ఈ కర్మలచే తత్తద్దేవతా శరీరకుడైన భగవంతుడే ఆరాధింపబడుచున్నాడు. ఈ మూడు యోగములు చిత్తైకాగ్ర్యమును కలిగించి తన్మూలమున ఆత్మ దర్శనమునకు సాధకము లగుచున్నవి.

శ్లో॥ నిరస్త నిఖిలాఽజ్ఞానో దృష్ట్వాత్మానం పరాఽనుగమ్ ।
ప్రతిలభ్య పరాం భక్తిం తయైవాప్నోతి తత్పదమ్ ॥

అర్థ-: నిరస్త నిఖిల+అజ్ఞానః=తొలగిన సమస్త-అజ్ఞానములు గలవాడై; ఆత్మానం=జీవాత్మను; పర+అనుగం=పరమాత్మను అనుసరించి ఉండువానినిగ(భగవచ్ఛేషభూతునిగ) దృష్ట్వా=తెలిసికొని; పరాం భక్తిం=(దానిచే) పర భక్తిని; ప్రతిలభ్య=పొంది; తయా=(పరమ భక్తిగా పరిపాకము జెందిన) ఆ భక్తి చేతనే; తత్=ఆ; పదం=పరమ పదమును; ఆప్నోతి=పొందుచున్నాడు.

తా-: కర్మయోగాద్యనుష్ఠానముచే ఉపాయ విరోధులైన సర్వవిధ అజ్ఞానములు నశింపగా జీవాత్మ పరమాత్మకు శేష భూతమైన దను వాస్తవముసు దర్శించి దానిచే పరమాత్మయందు పరభక్తి గలిగి వర్తించుచు క్రమముగ పరమాత్మానుగ్రహమున పరమ భక్తిగా పరిణతమైన ఆ భక్తిచే ఉపాసకుడు పరమ పదమును పొందుచున్నాడు.

శ్లో॥ భక్తియోగ స్తదర్థీ చే త్సమగ్రైశ్వర్య సాధనమ్ ।
ఆత్మార్థీ చే త్త్రయోఽప్యేతే తత్కైవల్యస్య సాధకాః ॥

అర్థ:- తత్+అర్థీచేత=ఐశ్వర్యమును కోరువాడగు పక్షమున; భక్తి యోగః=భక్తియోగము; సమగ్ర+ఐశ్వర్యసాధనం=సంపూర్ణైశ్వర్యమునకు సాధకమగును; ఆత్మ+అర్థీచేత్=కేవలము ఆత్మదర్శనమును మాత్రమే చేయగోరువాడగుచో ఏతే=ఈ; త్రయః+అపి=మూడు యోగములును; తత్+కైవల్య=అతని కేవల-ఆత్మానుభూతికి; సాధకాః=సాధకములు.

తా:- భక్తియోగము ఐశ్వర్యార్థికి ఐశ్వర్యమును చేకూర్చును. కేవలస్వాత్మానుభూతిని కోరువానికి కర్మ జ్ఞానభక్తి యోగములు మూడును కైవల్యమునకు సాధకములగును.

శ్లో॥ ఐకాన్త్యం భగవత్యేషాం సమానమధికారిణామ్ ।
యావత్ప్రాప్తి పరార్థీచేత్త దేవాత్యన్తమశ్నుతే ॥

అర్థ:- భగవతి=భగవంతునియందు; ఐకాన్త్యం=త (భగవ) దేకశేషత్వము; ఏషాం=ఈ; అధికారిణాం=కర్మజ్ఞాన భక్తియోగా నుష్ఠాతలకు ముగ్గురకును; సమానం=సమానము యావత్+ప్రాప్తి=భగవంతునిపొందు నంతవరకును; తత్+అర్థీచే=ఆ భగవంతునే పొందగోరువాడగుచో; అత్యన్తం=మిక్కిలిగ; తత్=ఆ; పదం=స్థానమును; అశ్నుతే=పొందును.

తా:- కర్మజ్ఞానభక్తి యోగనిష్ఠులకు ముగ్గురకును భగవదేకశేషత్వము ఆవశ్యకము అపుడేకదా "చతుర్విధా భజన్తేమాం" అనుటకువీరు ఉదాహరణమగుదురు చివరివరకు భగవత్ప్రాప్తినే కోరువాడు భగవత్పదమునే పొందును.

శ్లో॥ జ్ఞానీతుపరమైకాన్తీ తదాయత్తాత్మజీవనః ।
తత్సంయోగావియోగైక సుఖదుఃఖస్తదేకధీః ॥

అర్థ:- జ్ఞానీతు=జ్ఞానియన్ననో; పరమ+ఏకాన్తీ=ఏకాన్తులలో ఉత్తముడు; తత్+ ఆయత్త +ఆత్మజీవనః=పరమాత్మాధీనమైన తనజీవనము

గలవాడై; తత్ + సంయోగవియోగ + ఏకసుఖదుఃఖః=భగవత్సం శ్లేషము చేతనే సుఖమును; భగవద్విశ్లేషముచేతనే దుఃఖమును పొందువాడై; తత్ + ఏకధీః=ఆ భగవంతునియందే మనస్సును లగ్నము నొనర్చును.

తా-: దేవతాంతరములను భజింపక శ్రీమన్నారాయణునే ఆశ్రయించి ఐశ్వర్యాదులను పొందువారు ఏకాన్తులు ఆ ఐశ్వర్యాదులనుకూడా కోరక అనన్య ప్రయోజనముగ శ్రీమన్నారాయణుని సేవించువారు పరమైకాన్తులు వీరేజ్ఞానులు వీరినే భగవన్తుడు "జ్ఞానీత్వాత్మైవమే మతమ్" అనిఅని ప్రశంసించినాడు ఇట్టిజ్ఞానిసర్వము అభివన్తుడే.

శ్లో॥ భగవద్ధ్యాన యోగోక్తి వందన స్తుతి కీర్తనైః।
లబ్ధాత్మా తద్గత ప్రాణ మనో బుద్ధీన్ద్రియ క్రియః॥

అర్థ:- భగవత్ + ధ్యాన యోగ + ఉక్తి వన్దన సుతి కీర్తనైః=భగవన్తుని ధ్యానించుట; భగవత్సన్నిధికి పోవుట; భగవత్తత్త్వము నుపదేశించుట; భగవంతునికి నమస్కరించి స్తుతించుట కీర్తించుటచేత; లబ్ధ + ఆత్మా=పొందబడిన ఆత్మ సత్త గలవాడై; తత్ + గత ప్రాణమనః + బుద్ధి + ఇంద్రియ క్రియః=భగవదధీనములైన ప్రాణములు మనస్సు బుద్ధి ఇంద్రియముల వ్యాపారములు గలవాడగును.

తా-: పరమైకాన్తి భగవన్తునే ధ్యానించును భగవన్తునే దర్శించును-భగవతత్త్వమునే ఉపదేశించును భగవంతునికి నమస్కరించును అతనినే స్తుతించును-కీర్తించును-అభగవంతునివలననే స్వరూప సత్తను పొందు తన ప్రాణ మనో బుద్ధీంద్రియముల వ్యాపారములను భగవత్పరము గావించును.

శ్లో॥ నిజ కర్మాది భక్త్యన్తం కుర్యాత్ప్రీత్యైవ కారితః।
ఉపాయతాం పరిత్యజ్య న్యస్యేద్దేవే తు తామభీః॥

అర్థ-: ప్రీత్యా + ఏవ=నిరతిశయ ప్రీతిచేతనే; కారితః=ప్రేరితుడై; నిజ కర్మాది భక్త్యన్తం=స్వ వర్ణాశ్రమోచిత కర్మానుష్ఠానము మొదలు

భక్తి పర్యన్తము; కుర్యాత్=అనుష్ఠింపవలయును ఉపాయుతాం=(కర్మాదుల యందు) ఉపాయత్వమును; పరిత్యజ్య=విడిచిపెటి; తాం=ఆ ఉపాయత్వ బుద్ధిని; దేవే=భగవంతునియందు; న్యస్యేత్=ఉంచవలయును అభీః=(అంతట) భయ రహితుడై ఉండవలయును.

తా.: నిరతిశయ ప్రీతితో కర్మాదులను అనుష్ఠించుచు ఆ కర్మాదులే శ్రేయస్సాధనములు అని తలంపక భగవంతుడే శ్రేయస్సాధన మని తలంచి నిర్భయుడై వర్తింపవలయును సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు పరమ కారుణికుడు ఉపాయమైనపుడు ఎట్టి భయమునకును అవకాశమే ఉండదు గదా.

శ్లో॥ ఏకాన్తాఽత్యన్త దాస్యైక రతి స్తత్పద మాప్ను యాత్
తత్ప్రధాన మిదం శాస్త్రం ఇతి గీతార్థసంగ్రహః ॥

అర్థ.: ఏకాన్త + అత్యన్త దాస్య + ఏక రతిః = పరమైకాన్తియై (అనన్య ప్రయోజనముగ భగవదేక నిష్ఠ గలవాడై) సర్వవిధ భగవద్దాస్యములయందు ఆసక్తి గలిగియుండువాడు ["తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః" అని ప్రశంసింపబడు] తత్ + పదమ్=ఆ పరమపదమును; ఆప్నుయాత్=పొందును ఇదం శాస్త్రం= ఈ గీతాశాస్త్రము తత్ ప్రధానం=భక్తి ప్రపత్తి నిష్ఠగల పరమైకాని పొందు నిరతిశయ ఫలమును ప్రధానముగ బోధించునది-ఇతి=అని; గీతార్థ సంగ్రహః=నిష్కృష్టమైన గీతాశాస్త్రార్థము.

తా:- భగవదేక నిష్ఠుడైన పరమైకాన్తి నిరతిశయ ప్రీతితో భగవత్కైంకర్యము గావించుచు దేహావసానమున పరమ పదమును పొందును.

ఇదియే గీతాశాస్త్ర సారార్థము.
శ్రీమ ద్యామున ముని ప్రణీతమైన
గీతార్థ సంగ్రహము సమాప్తము.
శ్రీ మద్యామున మునయే నమః



:- శ్రీ కృష్ణార్పణమస్తు :-

# లభ్యపుస్తకసూచి

గోదా గ్రంథమాల - ముసునూరు, కృష్ణాజిల్లా - 521 207

| దివ్యప్రబంధ వ్యాఖ్యలు | రూ. పై. |
|---|---|
| పెరుమాళ్ తిరుమొళి | 15-00 |
| దివ్యప్రబంధత్రయి (తిరుమాల-అమలనాదిఃరాన్‌కణ్ణినుణ్ శిరుత్తాంబు) | 10-00 |
| ఉపదేశరత్నమాల | 10-00 |
| తిరుమంత్రార్థము | 12-00 |
| తిరువాశిరియము - పెరియ తిరువందాది | 12-00 |
| తిరువాయ్ మొళి 2,3,4,5,6,7,8,9 పత్తులు 12 × 8= | 96-00 |
| పెరియాళ్వార్ తిరుమొళి 1వ పత్తు | 18-00 |
| పెరియాళ్వార్ తిరుమొళి 2వ పత్తు | 18-00 |
| పెరియాళ్వార్ తిరుమొళి 3వ పత్తు | 18-00 |

| ఇతరములు | |
|---|---|
| శ్రీ భాష్యసారము 1 భా. (ఇతరల ప్రచురణ) | 25-00 |
| శ్రీ భాష్యసారము 2 భా. (అచ్చులో) | 25-00 |
| శ్రీ గోదాస్తవము వ్యాఖ్యతో | 20-00 |
| భగవద్గీతామృతము వ్యాఖ్యతో (1వ షట్కము) | 20-00 |
| భగవద్గీతామృతము వ్యాఖ్యతో (2వ షట్కము) | 20-00 |
| భగవద్గీతామృతము వ్యాఖ్యతో (3వ షట్కము) [అచ్చులో] | 20-00 |
| గద్యత్రయ వ్యాఖ్య | 15-00 |
| రామాయణ తనిశ్లోకి (2వ భాగము) | 12-00 |
| దివ్య సూరి కథాసారము | 15-00 |
| రామానుజ కథాసారము | 12-00 |

1) ముందుగా 250/- రూ॥లు పంపినవారికి పైవన్నియు ఉచితము.
2) ఖర్చులు చాల పెరిగినందున సంవత్సర చందా రూ. 30/-చేసినాము.
3) వి. పి. పోస్టు ఖర్చులు అదనము. *(Extra)*

మన గ్రంథమాలకు తమ ఘన సహకార మందించిన యీ సహృదయులకు మా నవవర్ష శుభాకాంక్షలు.

—శ్రీ గోదా గ్రంథమాల

| | |
|---|---|
| శ్రీమాన్ నమ్మాళ్వార్ గారు రాఘవపురము | 316 |
| శ్రీమాన్ యస్. అర్. యస్. అయ్యంగార్ తిరుమల | 232 |
| శ్రీమాన్ సౌమిత్రి మధుసూదనాచార్యులు గారు భద్రాచలము | 216 |
| శ్రీ రమణ మద్రాసు | 216 |
| శ్రీమాన్ డా. యస్. వి. రంగరామానుజాచార్యులు గారు కొవ్వూరు | 200 |
| శ్రీమాన్ కె. సుప్రసన్నాచార్యులవారు వరంగల్ | 200 |
| శ్రీమతి బి. ప్రేమలత గారు సికిందరాబాద్ చి. హరిణి (పుత్రి జన్మదినోత్సవ సందర్భమున) | 116 |
| శ్రీమాన్ గట్టు వేంకటాచార్యులు గారు భద్రాచలము | 116 |
| శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులవారు హనుమకొండ | 116 |
| శ్రీమాన్ నారాయణం శ్రీరామాచార్యులవారు, గనికపూడి | 116 |
| శ్రీమతి కె వరలక్ష్మిగారు చిననిండ్రకొలను | 116 |
| శ్రీ రాధారామారావు దంపతులు హైదరాబాద్ | 116 |
| శ్రీ పి. కోదండరామయ్యగారు హైదరాబాద్ | 116 |
| శ్రీమాన్ మరింగంటి రాఘవాచార్యులుగారు హైదరాబాద్ | 116 |
| చి. అనిరుద్ధ అన్నప్రాశనమహోత్సవ సందర్భమున తాతగారు శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులవారు హనుమకొండ | 108 |
| శ్రీ అత్తిలి వేంకటరమణగారు నూజివీడు | 108 |
| మాతృదేవత శ్రీమతి కీ. శే. తాయారమ్మగారి దివ్య స్మృతికై శ్రీమాన్ డా. చిం శ్రీరంగాచార్యులవారు అర్మూర్ | 100 |
| పుత్రుడు కీ. శే. వెంకటరమణ స్మృతి చిహ్నముగా శ్రీమాన్ డా. చిం. శ్రీరంగాచార్యులవారు. అర్మూర్ | 100 |
| శ్రీమాన్ యస్. లక్ష్మణమూర్తిగారు వరంగల్ | 100 |
| శ్రీమాన్ డా. యస్. శ్రీరంగాచార్యులుగారు పాలెము | 100 |

| | |
|---|---|
| శ్రీ సరస్వతీ గోవిందరాజులుగారు, కిషన్‌దాస్‌పేట | 200-00 |
| శ్రీ వాడపల్లి చక్రపాణిరావుగారు, అమలాపురము | 100-00 |
| శ్రీమాన్ కె. నరసింహాచార్యులుగారు, బిచ్‌కొండ | 100-00 |
| శ్రీమాన్ కె. వై. యల్. నరసింహాచార్యులుగారు, బందరు | 100-00 |
| శ్రీ టి. శ్రీనివాస్, జోగిపేట | 80-00 |
| శ్రీ చిట్లూరి కోటేశ్వరరావుగారు, విజయవాడ | 80-00 |
| శ్రీ తోట పూర్ణచంద్రరావుగారు, విజయవాడ | 72-00 |
| శ్రీ మోపిదేవి కృష్ణస్వామిగారు, విజయవాడ | 60-00 |
| శ్రీమతి కె. అన్నపూర్ణగారు, ఏలూరు | 60-00 |
| శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులవారు, భద్రాచలము | 60-00 |
| శ్రీమాన్ డా. బి. వి. రంగాచార్యులుగారు, బందరు | 60-00 |
| శ్రీమాన్ యస్. టి. పి. శ్రీనివాసాచార్యులుగారు; ఏలూరు | 60-00 |
| శ్రీమాన్ యన్. వరదాచార్యులుగారు, మద్రాసు | 60-00 |
| శ్రీమాన్ యన్. సి. యన్. బి. ఆచార్యులుగారు, బందరు | 60-00 |
| శ్రీమతి కటంగూరు సుగుణమ్మగారు, హనమ్‌కొండ | 58-00 |
| శ్రీ చి. వేంకటసత్యనారాయణగారు, కూచిపూడి, కృష్ణా | 58-00 |
| శ్రీమాన్ కోగంటి వేంకటాచార్యులుగారు, నెల్లూరు | 51-00 |
| శ్రీ పి. వెంకట్రామరావుగారు, కరీంనగర్ | 50-00 |
| శ్రీ డా. యస్. కొండలరావుగారు, కట్టమూరు | 50-00 |
| శ్రీమాన్ న. చ. రామచంద్రాచార్యులుగారు, నూజివీడు | 50-00 |
| శ్రీమాన్ చలమచర్ల వేంకటాచార్యులవారు, గుడివాడ | 50-00 |
| శ్రీమాన్ యస్. టి. పి. రామానుజాచార్యులుగారు, నల్గొండ | 50-00 |
| శ్రీమాన్ న. తి. అళహసింగరాచార్యులుగారు, విజయవాడ | 50-00 |
| చి. సౌ. నాగపద్మజ వివాహసందర్భంగా తండ్రి శ్రీ కె. యస్. ఆర్. ఎ. శర్మగారు, హైదరాబాద్ | 50-00 |
| శ్రీమతి కె. అనూరాధగారు, హైదరాబాద్ | 50-00 |

| | |
|---|---|
| శ్రీమాన్ కే. ఎస్. రామానుజాచార్యులుగారు, నెల్లూరు | 50-00 |
| శ్రీమాన్ వంగల లక్ష్మి నరసింహాచార్యులుగారు, హైదరాబాద్ | 50-00 |
| శ్రీమాన్ టి. కె. వి. అయ్యంగార్, హనమ్‌కొండ | 50-00 |
| శ్రీమాన్ చి. సత్యలక్ష్మణాచార్యులుగారు, గుంటూరు | 50-00 |
| శ్రీమాన్ యస్. టి. పి. వి. రామానుజాచార్యులుగారు, నూజివీడు | 50-00 |
| శ్రీమాన్ కె. వి. ముకుందాచార్యులుగారు. విశాఖపట్నం | 50-00 |
| శ్రీమాన్ యన్. సి. వి. నరసింహాచార్యులువారు, తిరుపతి | 50-00 |
| శ్రీ అల్లూరి వేంకటనరసింహరాజుగారు, ఏలూరు | 50-00 |
| శ్రీమాన్ యన్. సి. యస్. వేంకటాచార్యులవారు, కోదాడ్ | 50-00 |
| డా. ప్రేమానందకుమార్, శ్రీరంగము | 50-00 |
| డా. ఆర్. బి. కృష్ణమూర్తిగారు, గుంటూరు | 50-00 |
| శ్రీమాన్ లక్ష్మణ యతీంద్రులవారు, ఏలూరు | 50-00 |
| ,, ముడుంబై గోపాలాచార్యులుగారు, ఏలూరు | 50-00 |
| శ్రీమతి స. చ. రామానుజమ్మగారు, ఏలూరు | 50-00 |
| శ్రీమతి చేవూరి రమాదేవిగారు, విజయవాడ | 50-00 |
| శ్రీ నందకిశోర్‌గారు, విజయవాడ | 50-00 |
| శ్రీమాన్ మోటుపల్లి వరాహస్వామిగారు, హనమ్‌కొండ | 45-00 |
| ,, గందిమెళ్ళ మురళీవేంకటకృష్ణమాచార్య, ఏలూరు | 41-00 |
| శ్రీ నాళం సుబ్రహ్మణ్యంగారు, ముసునూరు, | 40-00 |
| శ్రీమాన్ వేదాంతం సుదర్శనాచార్యులుగారు, నూజివీడు | 40-00 |
| ,, బి. నరసింహాచార్యులుగారు, బందరు | 40-00 |
| ,, గుదిమెళ్ళ రంగాచార్యులుగారు, గుంటూరు | 35-00 |
| ,, మరింగంటి అప్పలాచార్యులుగారు, ఏలూరు | 35-00 |
| శ్రీ కరి శ్రీధరరావుగారు, నాగాయలంక | 30-00 |

| | |
|---|---|
| శ్రీ యస్. యల్. యన్. మూర్తిగారు, కాకినాడ | 30-00 |
| డా. కె. సదాశివరావుగారు, గుంటూరు | 30-00 |
| శ్రీమాన్ మంగపల్లి సీతారామాచార్య, హైదరాబాద్ | 30-00 |
| శ్రీ ధన్యంరాజు శంకరంగారు హైదరాబాద్ | 30-00 |
| శ్రీమాన్ గుదిమెళ్ళ కస్తూరి రంగాచార్య, హైదరాబాద్ | 30-00 |
| శ్రీమాన్ ఆరుట్ల కేశవమూర్తిగారు, హనమ్‌కొండ | 30-00 |
| శ్రీమతి సౌమిత్రి రంగనాయకమ్మగారు, హనమ్‌కొండ | 30-00 |
| శ్రీమాన్ పరాశరం గోపాలకృష్ణమూర్తిగారు, గుంటూరు | 30-00 |
| శ్రీ పడాల సూర్యనారాయణగారు, నూజివీడు | 30-00 |
| శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తిగారు, కృష్ణంపాలెము | 30-00 |
| శ్రీమతి కడపకొల్లు పార్వతిగారు, ఉల్లిపాలెము | 30-00 |
| శ్రీమతి యమ్. సుమతిగారు, హనమ్‌కొండ | 30-00 |
| శ్రీమాన్ వేదాంతం గోపాలకృష్ణమాచార్యులు, ముసునూరు | 30-00 |
| శ్రీ వడ్లమూడి వేంకటేశ్వరరావుగారు, ఏలూరు | 30-00 |
| శ్రీమాన్ ముడుంబై నారాయణాచార్యులుగారు, ఏలూరు | 30-00 |
| పత్ని కీ. శే. అలివేలు మంగతాయారమ్మ స్మృతికై శ్రీమాన్ కిడాంబి వేంకటచలపతిగారు, ఏలూరు | 30-00 |
| శ్రీమాన్ ముడుంబ పాండురంగాచార్యులుగారు, తుని | 30-00 |
| శ్రీమాన్ కె. యన్. శ్రీనివాసన్‌గారు, బెంగుళూరు | 30-00 |

○○○